నేటి దినపత్రిక
సూర్య
www.suryaa.com
ఆదివారం
16 జులై 2017

# జనం కోసం జస్టిస్

## అంతర్జాతీయ న్యాయ దినోత్సవం

లోపలి పేజీల్లో..

5వ పేజీలో



7వ పేజీలో అపరంజి



10 వ పేజీలో



15 వ పేజీలో



# చైర్మన్‌తో ముఖాముఖి





నూకారపు సూర్యప్రకాశరావు

**బీరు హెల్త్ డ్రింకని అంటున్న ఏపీ ఎక్సైజ్ మంత్రి జవహర్ చేసిన వ్యాఖ్యలు బాధ్యతా రాహిత్యం కాదంటారా?**

బాధ్యతా రాహిత్యం కాదని ఎవరంటారు? లైట్ బీర్ లో 5%, స్ట్రాంగ్ బీర్ లో 8% ఆల్కహాల్ ఉంటుందని, అటువంటప్పుడు అది ఎలా హెల్త్ డ్రింక్ అవుతుంది? ఏపీ నూతన మద్యం పాలసీని ప్రవేశపెడుతూ మంత్రి జవహర్ ఈ వాఖ్యలు చేశారు. బీరు ను సంప్రదాయ హెల్త్ డ్రింక్ అనేలా ప్రచారం చేస్తామని చెప్పా రు. కాక పోతే మంత్రి అలా అనడం వెనుక అంతర్యం ఏమిటో? బీర్ బాటిల్ పై ఆరోగ్యానికి హానికరం అని ముద్రించి ఉంటుం దన్న సంగతి మంత్రికి తెలియదా అనేది ఇక్కడ మరోప్రశ్న తెలెత్తుతుంది. తెలిస్తే అలా ఎందుకు మాట్లాడుతారు? తెలియకపో తే ఆయన ఎక్సైజ్ మంత్రికి ఆమాత్రం తెలియదా? అనే ప్రశ్నలు తలెత్తుతాయి. సో..నోరు జారి జవహర్ గారు చిక్కులు కొని తెచ్చుకున్నారు.

**సార్..టీఆర్ఎస్ ప్రభుత్వం తలపెట్టిన ఆకుపచ్చ తెలంగాణ సాధ్యమంటారా?**

సాధనమున పనులు సమకూరు ధరలోన అన్నాడు వేమన. పాలకులు, అధికారులు చిత్తశుద్ధితో పనిచేస్తే, ప్రజలు సహకరిస్తే ఏదైనా సాధ్యమే. ఆకుపచ్చ తెలంగాణే కాదు బంగారు తెలంగాణ కూడా.ప్రభుత్వ ఆలోచన చాలా మంచిది. బావితరాలకు పచ్చని భవిష్యత్తును ఇచ్చే లక్ష్యం ఆకుపచ్చ తెలంగాణ. హరితహారం మూడో దశ ప్రారంభిస్తు, సీఎం కేసీఆర్ ఓచక్కని మాటన్నారు. ఇంట్లో పిల్లలను ఎలా పెంచుతామో మొక్కలను కూడా అలా పెంచాల్సిన అవసరం ఉందని సీఎం చెప్పారు. పిల్లలను పెంచి, చదివించి, ఎంత ధనం ఇచ్చినా.. వారు బతికే పరిస్థితి ఇవ్వక పోతే లాభం లేదని ఆయన వ్యాఖ్యానించారు. ఆయన చెప్పింది అక్షర సత్యం. అందుకే సాధ్యమా అనే మీమాంస కన్నా, సాధ్యమే అనే ధోరణిలో మనం కూడా నడుం బిగించాలి.

**సార్..ఆంధ్రప్రదేశ్‌లోని మున్సిపాలిటీల్లో హౌసింగ్ వర్క్ షాపులు నిర్వహిస్తారట. సీఎం కూడా పాల్గొంటాడట. కామెంట్ ప్లీజ్!**

చాలా మంచి ఆలోచన. వచ్చే వారం నుంచి ఏపీలోని అన్ని పట్టణాల్లో హౌసింగ్ వర్క్ షాప్‌లు నిర్వహించాలని అక్కడి ప్రభుత్వం నిర్ణయించడం ముదావహం. హౌసింగ్ లబ్ధిదారులకోసం ఈ వర్క్‌షాప్‌లను నిర్వహించనున్నారు. వారికి ప్రభుత్వం నిర్మించి ఇచ్చే గృహాలకు సంబంధించి మూడు నమూనాలు లబ్దిదారులకు ఇచ్చి, వారికి నచ్చిన నమూనాను వారే ఎంపిక చేసుకునే అవకాశం ప్రభుత్వం కల్పిస్తుంది.అంటే లబ్దిదారుడు తాను కలలు కన్న ఇంటిని, తన ఊహలకు దగ్గరగా నిర్మించుకునే ఛాన్స్ ప్రభుత్వం కల్పించిందన్నమాట. ఇది లబ్ధిదారులకు సంతోషదాయకమే కదా! గేటెడ్ కమ్యూనిటిగా ఇళ్ల నిర్మాణాన్ని ప్రోత్సహించాలన్న ఉద్దేశ్యంతో ప్రభుత్వం ఈ కార్యక్రమాన్ని నిర్వహిస్తోంది. ఇక సీఎం పాల్గొనడం అంటే, ప్రజలను ప్రోత్సహించడం కోసమే అని అర్థం చేసుకోవాలి.

**రౌడీ నేతలపై జీవితకాల నిషేధం..విధించాలా? వద్దా? వైఖరిని స్పష్టంగా చేయాలని ఈసీని కోరిన సుప్రీం కోర్టు. కామెంట్ ప్లీజ్.**

ప్రస్తుతం ఈ అంశం సుప్రీం కోర్టులో ఉంది కాబట్టి మనం వ్యాఖ్యానించడం సరైంది కాదు.కాని క్రిమినల్ కేసుల్లో దోషులుగా ఖరారైన రాజకీయ నాయకులు ఎన్నికల్లో పోటీ చేయకుండా జీవితకాల నిషేధం విధించే విషయంలో ఎన్నికల సంఘం తన వైఖరిని స్పష్టంచేయాలని సుప్రీం కోర్టు గతంలోనే కోరింది. అయితే ఈ విషయంలో ఎన్నికల సంఘం స్పందించ లేదు. దీంతో తన వైఖరి ఎందుక చెప్పడం లేదని సుప్రీం కోర్టు ఈసీని ప్రశ్నించింది. అంతే కాదు ఈ విషయంలో ఎన్నికల సంఘం మౌనంగా ఉండకూడదని స్పష్టం చేసింది. ఇక నిషేధం ఉండాలా వద్దా అనేది ఈసీ తీర్పును బట్టి ఉంటుంది.

**అనాథ శవానికి పోలీసు అధికారి అంత్యక్రియలు నిర్వహించిన కేరళ పోలీసులు. కామెంట్ ప్లీజ్!**

ఖాకీలు కర్కషులే కాదు, మాలోను మానవత్వం ఉందని నిరూపించారు. నిజంగా ఈ విషయంలో కేరళ పోలీసులను అభినందించాలి. కేరళలోని పతనంతిట్ట జిల్లా పులికీజ్హు పోలీసు స్టేషన్ పరిధిలోని ఈ సంఘటన చోటుచేసుకుంది. ఓ దుకాణం ముందు పడి ఉన్న శవాన్ని స్వాధీనం చేసుకున్న పోలీసులు, అది ఎవరి శవమో తెలుసుకునేందుకు తమ ప్రయత్నాలు తాము చేశారు. మృతదేహం ఫోటోను మీడియాలో ప్రకటన ఇచ్చారు. నాలుగు రోజులు గడిచినప్పటికీ ఎవరూ ముందుకు రాకపోవడంతో, అనాధ శవంలా భావించి, గాలికి వదిలేయకుండా అంత్యక్రియలు నిర్వహించి మానవత్వం చాటుకున్నారు. అనాథ ప్రేత సంస్కారం కోటి యజ్ఞాన ఫలం అంటారు. నిస్వార్ధంగా అంత్యక్రియలు చేసినో పోలీసులకు ఆ ఫలితం దక్కాలని ఆశిద్దాం.

**సార్..కలెక్టర్ పట్ల దురుసుగా ప్రవర్తించిన టీఆర్ఎస్ ఎమ్మెల్యే అరెస్ట్‌పై మీ అభిప్రాయం ఏంటి?**

అందరి అభిప్రాయమే నా అభిప్రాయం. చట్టం తనపని తాను చేసుకుంటూ పోతుంది. ప్రజాప్రతినిధి ఎవరైనా కలెక్టర్ విషయంలోనే కాదు, ఏ మహిళపట్లా అలా ప్రవర్తించకూడదు. అయితే ఈ విషయంలో సీఎం కేసీఆర్ చాలా సీరియస్‌గా స్పందించడం అభినందనీయం. అంతేకాదు సదరు ఎమెల్యే కూడా కలెక్టర్‌కు సారీ చెప్పారు.చేసిన తప్పుకు పశ్చాత్తాప పడ్డారు. అది ఆహ్వానించ దగిన పరిణామమే. కాని ప్రజలకు మార్గదర్శనం చేయాల్సిన వారు ఇలా ప్రవర్తించడం ( తనకు ఏ చెడు ఉద్దేశ్యం లేదని ఎమ్మెల్యే చెప్పుతున్నారు) సరైంది కాదు.

SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072
మెయిల్ అడ్రస్

## సెటైర్

# ఆర్భాటం కాదు ఆచరణ కావాలి!

నారు పోసినోడు నీరు పోస్తాడు....అని కూర్చుంటే సరిపోతుందా..చేతుల అడ్డం పెట్టకుండా, గాలిలో దీపం పెట్టి దేవుడా అంటే దీపం ఆరిపోకుండా ఉంటుందా? ఆ మాత్రం తెలియనోళ్లు ఎందుకురా భూమికి భారంగా బతుకుతారు.. అంటూ నోట్లో పెట్టిన చుట్టును వెలిగిస్తూ విసుక్కున్నాడు రంగయ్య. రంగయ్య ఎవరో చెప్పనే లేదు కదూ. తెలంగాణలోని ఓ మారు మూల పల్లెటూర్లో ఓ పెద్దమనిషి. పెద్దలకు గౌరవం ఇచ్చె స్వచ్ఛమైన తెలుగు పల్లె అది. సాయంత్రం కాగానే ఆ ఊరి జనం రచ్చబండ దగ్గర చేరి కబుర్లు చెప్పుకోవడం నిత్యకృత్యం. వర్షాలు పడుతుండడంతో రోజంతా వ్యవసాయం పనులకు వెళ్లి, చిన్నా పెద్ద అక్కడకు చేరారు. వారి దృష్టి తెలంగాణ సర్కార్ ప్రారంభించిన హరితహారం మీదికి మళ్లింది. అందులో ఒకడు అడవిలో చెట్లు మనం నాటితే పెరిగాయా ఏంటి. నారు పోసి నోడు నీరు పోస్తాడు. దానికి ఇంత హంగామా అవసరమా అన్నాడు. అది విన్న రంగయ్యకు ఒళ్లు మండిందో. చిర్రెత్తుకొచ్చిందో.. వెంటనే పై విధంగా స్పందించాడు. నారు పోసినోడు నీరు పోస్తాడని పని చెయ్యకుండా, వండుకొని తినకుండా బతుకు తెలుస్తది. ఒరేయ్ ఆ సామెతకు అర్దం అన్నీదేవుడే చేస్తాడని కాదురా, మన ప్రయత్నం మనం చేస్తే, ఏదో ఒక మార్గం చూపిస్తాడని. ముందు ప్రయత్నం చేయడం జరగాలి అది గుర్తుపెట్టుకో. ఇలాంటి మాటలు మాట్లాడి పోరగాండ్ల పాడుచేయకు... అన్నాడు రంగయ్య. ఇంతలో అక్కడకు వచ్చిన గ్రామ సర్పంచ్....రేపు మన ఊర్లో హరిత హారం ఉంది. మన ఎమ్మెల్యేతో పాటు, మంత్రి గారు కూడా వస్తున్నాడంటా. కార్యక్రమాన్ని ఫుల్ సెక్సెస్ చెయ్యాలి అన్నాడు. మిగతా వాళ్లంతా తలూపారు. మన రంగయ్య తప్ప. అది గమనించిన సర్పంచ్ గమనించనట్లే ఉండి, సరే అంటూ తలలు ఊపడం కాదు, రేపు పొలం పనులకు వెళ్లకుండా, మంత్రిగారు వచ్చి వెళ్లేవరకు ఇండ్లదగ్గరే ఉండాలి. అంటూ ఓ మోస్తరుగా హుంకు జారీచేశారు. అన్ని ఊర్లు ఇంటికో మొక్క నాటుతున్నాయి. మన ఊర్లో మాత్రం మనిషికో మొక్క నాటాలి. నియోజక వర్గంలోనే మన ఊరు ఫస్ట్ రావాలి. మన ఊరు పేపర్లో పడాలి. మన ఊరి గురించి టీవీల్లో రావాలి. అన్నాడు సర్పంచ్. మీరు ఎలా చెబితే అలానే అన్నాడు అక్కడ కూర్చున్న వారిలో ఓ వ్యక్తి. మిగతవాళ్లు కూడా అలా అన్నట్లు మరోసారి త లూపారు. అదంతా గమనిస్తున్న రంగయ్యకు మళ్లీ చిర్రెత్తుకొచ్చింది. ఓరేయ్ మీరు మనుషులా?.. గొర్రెలా..? సర్పంచ్ చెప్పిన ప్రతిదానికి తలూపుతున్నారు. గతంలో మనూర్లో నాటిన మొక్కలు ఎన్ని బతికాయిరా? అసలు నాటింది ఎన్ని? ఇంటికో మొక్క నాటామా లేదా? అవి ఎటుపోయాయి? ఇంటికి ఒక మొక్క నాటితేనే బతికించుకో లేనోళ్లు, మనిషికో మొక్క నాటితే బతికించుకుంటారా? అంటూ ప్రశ్నించారు. అతని ప్రశ్నతో ఖంగుతిన్నాడు సర్పంచ్..మరి ఏంచేద్దామంటావు మామా అన్నాడు అక్కడ చేరిన వారిలో ఇంకొకతను. అది మన మందరం కూర్చొని నిర్ణయించాల్సిన అంశం. మన సర్పంచే చెప్పినట్లు చేస్తే పేపర్లో ఊరు పేరొస్తది. మంత్రితో దిగిన సర్పంచ్ ఫోటో వస్తది. కాని గతంలో లాగానే మళ్లి సంవత్సరానికి మనిషికి రెండు మొక్కలు నాటాలని పిలుపొస్తది అన్నాడు రంగయ్య. కాంగ్రెస్ నేత వీహెచ్ అన్నట్లు .. హరితహారం పేరుతో ప్రభుత్వం ప్రచారం మాత్రం చేసుకుంటుందన్న దాంట్లో పూర్తిగా నిజం లేదు. నిజం లేక పోలేదు. కాకపోతే ఆయన మాటల్లో ఒక నగ్న సత్యం మాత్రం ఉంది. ఇది తెరాస సర్కారు తీసుకొచ్చిన కొత్త కార్యక్రమం కాదు. కేసీఆర్ యూత్ కాంగ్రెస్‌లో ఉన్నప్పుడు కూడా మొక్కలు నాటారని వీహెచ్ అన్నదాంట్లో నిజం లేక పోలేదు. కాక పోతే కాంగ్రెస్ హయంలో కూడా పెద్ద ఎత్తున నాటిన మొక్కలు ఏమైనట్లు? ఎందుక బతలేదు అనేదానికి వీహెచ్ సమాధానం చెప్పలేదు? కాని తెరాస సర్కారు గతంలో నాటిన మొక్కలు ఎన్ని బతికాయో చెప్పాలని మాత్రం డిమాండ్ చేశారు. అంటే మొక్కలు నాటడం అనేది కూడా రాజకీయ లబ్ధికి ఉపయోగపడుతుందన్నది మాత్రం నిజం. గతంలో ఏ పల్లెలో చూసినా, అంతెందుకు మన ఊరిలో కూడా పచ్చని చెట్లు దర్శనమిచ్చేవి. కాని ఇప్పుడు ఆ చెట్లు ఏమైట్లు. ఊరు జనాభాకు తగ్గట్లు ఊరు పెరలేదు.కాని ఒక్కో ఇంట్లో నాలుగు ఇండ్లు అయ్యాయి. దాంతో ఇంటి ముందు ఉన్న చెట్లను నరికి నలుగురు అన్నదమ్మలుంటే, స్థలాన్ని పంచుకుని నాలుగు ఇండ్లు కట్టుకున్నారు. ఇక పట్టణాలలో ఇంటిముందు గజం జాగా ఉండదు. మరి మనిషికో మొక్క ఎక్కడ నాటాలి. బజారుల్లో ఎన్ని మొక్కలు నాటగలం? మీరే చప్పండి లేదా మన ప్రెసిడెంటు గారిని చెప్పమనండి. 40 కోట్ల మొక్కల లక్ష్యం సూపర్. మొక్కలు నాటడం కోసం కోట్లు వెచ్చిస్తున్నారు. కాని పల్లెల్లో స్థలం ఎక్కడుంది. పొలం గట్లెంట నాటితే,వర్షాకాలంలో అయితే సరి. వేసవిలో ఎలా బతకాలి. సీం చెప్పినట్లు హరిత దళాలు ఊరూరా ఏర్పాటు చేస్తే, ఒక్కో ఊరిలో నాటిన వేలాది మొక్కలకు నీరు పోయగలరా? పోని నాటిన వారితో పోయించేందుకు, ఎండాకాలంలో మన ఊరిలో ఉంటే నీటి సమస్య మనకు తెలియందా? అంటూ ప్రశ్నించాడు రంగయ్య. అక్కడ ఉన్నవాల్లంతా నోరెళ్లబెట్టి చూస్తుంటే, సర్పంచ్‌కు మాత్రం చిర్రెత్తుకొచ్చింది. ఏంటి రంగయ్యా..నువ్వెప్పుడు ప్రభుత్వాలను విమర్శించడమే పనిగాపెట్టుకున్నావు. ఇలాంటి కార్యక్రమాల్లో జనాల్ని ప్రోత్సిహించాల్సింది పోయి. నిరుత్సాహ పరుస్తావా అంటూ కాస్త కటువుగానే ప్రశ్నించాడు. సర్పంచ్ గారికి కోపం వచ్చినట్లుంది. నేను ఉన్న మాట అంటే ఉలుకెందుకు? రేపు మంత్రి వచ్చి మొక్కలు నాటి పోయాక ఎవరు కాపాడాలి? ఎలా కాపాడాలి? అనే ప్రణాళిక ఏమైనా ఉందా మీ దగ్గర. నగరాల్లో పట్టణాల్లో పార్కులు, ఖాలీ ప్రదేశాల్లో మొక్కలు నాటేందుకు ప్రణాళికలు రెడీగా ఉన్నాయి. మరి మన ఊరి మాటేంటి? ఎక్కడ నాటిస్తారు చెప్పండి? ఊరిలో ఆ చావడి వద్ద మంత్రిచే మొక్క నాటించి ఫోటోలకు ఫోజులిచ్చి వెళతారా.. మరి మీరు పంపణీ చేసిన వేలాది మొక్కల మాటేంటో చెప్పండి. అంటూ నిలదీశాడు? చూడు సర్పంచ్ గారు. సర్కార్ లక్ష్యం మంచిదే. కాని కార్యచరణకు వచ్చేవరకే నీరు గారిపోతోంది. గత రెండు హరిత హారాల్లో నాటిన మొక్కలు ఏమైనాయో ఆలోచించండ? . ఒక్క సీఎం నియోజ వర్గంలో మాత్రం ఎందుకు బతికాయో చెప్పండి? అక్కడ అధికారులు చిత్తశుద్దితో పనిచేశారు.ప్రజల్లో అవగాన పెంచి, వారి సహకారంతో సెక్సెస్ చేసారు.అది గమనించండి ముందు. మీరు కూడా ఊర్లో ఎక్కడ మొక్కలు నాటాలి, వార్డుల వారిగా వాటిని బకతికించే బాధ్యం ఎవరు తీసుకోవాలి? అందుకు ప్రజలు సహకారం ఏరూపంలో అందాలి అనేది ప్రణాళిక సిద్దం చేయండి. అవసరమైతే రాత్రంతా ఇక్కడే కూర్చొని ప్రజలతో మాట్లాడి నిర్ణయానికి రండి. ఆర్భాటాలకు పోతే గతం పునరావృతం అవుద్ది. ఫలితం దక్కదన్నాడు రంగయ్య. దాంతో సమాధానం చెప్పలేక సర్పంచ్ అక్కడి నుంచి జారుకున్నాడు. చూశారుగా సర్పంచ్ ఎలా జారుకున్నాడో. అందుకే మనకు చెట్లు ప్రాణాధారం. వాటిని బిడ్డల్లా సాకాలి.అందుకు ఈ ఆర్భాటాలతో పనిలేదు. ప్రభుత్వం సరఫరా చేసిన మొక్కలను ఎక్కడ నాటి ఎలా బతికించుకోవాలో ఆలోచించుకోండి అంటూ అక్కడ గుమికూడిన జనాలకు చెప్పి రంగయ్య ఇంటికి బయలు దేరాడు.



శిశువు హాయిగా నిద్రించే ఉయ్యాల, మృతుడు శాశ్వతంగా నిద్రించే సమాధి, ఈ రెంటిపైనా మెరిసే తార మానవుడి ఆశ. -అరవింద యోగి

## నవకవిత్వం

# కారంచేడు

మంచి నీళ్లు తాగే చెరువులో
బర్రెలను కడుతున్నావు
ఏంది దొర...
అని అడిగినందుకు

నరకటం నరకటం
మేకపోతుల తల తెగ్గొట్టినట్టు
మనిషిని నిలువున నరకటం
పరిగెత్తించి పరిగెత్తించి పొడవటం
పరాయి దేశాలపై కసితీరా బాంబులేసినట్టు
పల్లె పల్లె మొత్తం వల్లకాడు చెయటం

ఇంట్లో ఉన్న ఆడోళ్ళన రోడ్లపైకి తెచ్చి తన్నటం
ఆడిగినందుకు మొఖాలపై పిడిగుద్దులు గుద్దటం
చూస్తుండంగానే కర్రలతో కొట్టడం
బరిసలతో గొడ్డులను బాదినట్టు బాదటం
కనిపించిన వాళ్ళని కనిపించినట్టు
కసిగా పొడుస్తూ గునపాలు దించటం
అమ్మ , అక్క ,చెల్లెళ్లపై
అమానుషంగా దాడిచేయటం

కాళ్లకింద నల్లిని నలిపినట్టు నలపటం
క్రూరాతి క్రూరంగా ప్రవర్తించటం
ఐదుగురిని చంపటం
ఏంతోమందిని గాయపర్చటం
మంది మార్బలంతో భయపెట్టడం
కారంచేడు...కారంచేడు...కారంచేడు...
చరిత్రలో...
చెరిగిపోని నెత్తుటి చరిత్ర పేరు కారంచేడు.
(కారంచేడు సంఘటన జరిగి 32 సంవత్సరాలు
17-07-1985 - 17-07-2017 అయినందుకు)

తంగిరాల - సోని
కంచికచర్ల, సెల్ : 96 766 09 234

## రన్నింగ్ వాయిస్




స్పందిస్తున్నా..
సార్ సండే స్పెష్‌లో వస్తున్న కూనిరాగాలు అక్షర సత్యాలు. స్పందించడం ఆగిపోతే జీవితండం కష్టం...ఎంచ చక్కని జీవిత సత్యం చెప్పారు. అందుకే స్పందిస్తున్నా..

...చారి, కర్నూలు

**సుస్వరాల బాణి..**
తెరవెనుక తారలు శీర్షికలో కోదండ పాణి గారి గురించి చాలా చక్కగా వివరించారు. తెరవెనుక తారలే కాదు మనం విస్మరిస్తున్న మన పెద్దల గురించి చక్కగా వివరిస్తున్నందుకు దన్యవాదాలు.

.......శ్రీకాంత్, హైదరాబాద్

**డ్రగ్సోపాఖ్యానం బాగుంది**
సండే స్పెషల్‌లో ఇస్తున్న సెటైర్ బాగుంటుంది. ఈ వారం ఇచ్చిన డ్రగ్సోపాఖ్యానం సమాజం పట్ల ప్రజల బాధ్యతను గుర్తుచేసింది.

...రామారావు, నల్లగొండ

**తెలుసుకోండిలా..**
తెలుసుకోండిలా అంటూ మీరు అందిస్తున్న న్యాయ సమాచారం చాలా బాగుంటుంది. ఈ వారం కులాంతర వివాహాలు, సంతానానికి సంబంధించిన అమూల్యమైన సమాచారం అందించినందుకు థ్యాంక్స్..

..శ్రీజ, రామంతపూర్

**కవర్ స్టోరీ సూపర్**
జనం జనం ప్రభంజనం పేరుతో పెరుగుతున్న జనాభా, దాని పర్యవసానాల గురించి చాలా చక్కగా వివరించారు. మీరు చెప్పినట్లు జనాభా నియంత్రణ పాలకులు బాధ్యతే కాదు, మన అందరి బాధ్యత.

....చక్రధర్, పటాన్‌చెరువు

**అందమైన కథ**
ఈ వారం ఇచ్చిన అందమైన జీవితం కథ బాగుంది. కథ రాసిన మంతెన సూర్యనారాయణగారికి, అందించిన మీకు దన్యవాదాలు

....దాసోజు రాములు, మిర్యాలగూడ

**నో మొబైల్ ఆన్ మొబైల్**
బుడతడు పేజీలో వచ్చిన సెల్‌ఫోన్ కథ బాగుంది. డ్రైవింగ్ చేస్తూ సెల్ ఫోన్ మాట్లాడితే పర్యవసానం ఏంటో వివరించారు. సంతోషం

....రమేష్, టీచర్, తుర్కయంజాల్

## 'కూని'రాగాలు

వ్యర్థ మాటలతో శక్తి వృథా అవుతుంది..!
వాగ్ధాటితో సభ మైమరచి పోతుంది..!!

చింతిస్తే జరిగిపోయింది తిరిగిరాదు..!
శోధిస్తే చింతనకు మూలం దొరకచ్చు..!!

విజయం నిస్వార్థంతో వరిస్తే శాశ్వతం..!
కిరణం దేహాన్ని తాకితే ఉపశమనం..!!

నీహాసంలో మెరుగు అవసరం..!
నీవదనంలో ప్రశాంతత అవశ్యం..!!

మార్గం ఎంత కఠినమైనా తప్పనిసరి..!
గమ్యం ఎంత జఠిలమైనా నీఆశయం..!!

- కూనిరెడ్డి శ్రీనివాస్

## ఫన్ చ్

నారు










జ్ఞానం, విజ్ఞానం సంపాదించుకోవాలని అందూ అభిలషించేవారే. అయితే వాటికి మూల్యం చెల్లించడానికి ఇష్టపడేవారెవ్వరూ లేరు. -జువెనల్

## చిన్నారుల కోసం

# ఇష్టమున్న రంగంలో విజయం

**అదొక జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల. విద్యార్థులందరూ త్రైమాసిక పరీక్షలు రాయటంలో నిమగ్నమై ఉన్నారు. కుసుమ పేపరు వైపు చూస్తూ ఆలోచిస్తోంది. 'నువ్వీసారి కనీసం 60 శాతం మార్కులు తెచ్చుకోకపోతే తొమ్మిదో తరగతి మళ్లీ చదువుతావు' అన్న మాస్టారి మాటలు పదేపదే గుర్తుకొస్తున్నాయి. తనకు ఎంత చదివినా గుర్తుండటం లేదు. ఏం చేయాలో అర్థం కావట్లేదు.**

పరీక్షలు మొత్తానికి రాశానని అనిపించింది. ఆఖరి పరీక్ష రోజు వాళ్ల క్లాసు మాస్టారు రాజారా వుగారు క్లాస్‌లో హెడ్ మా స్టర్ పంపిన నోటీసు చదివి వినిపిం చారు. పక్క ఊరి లో జిల్లా స్థా ం ు ు బాలికలు, బాలుర కబడ్డీ పోటీలకు ఆహ్వానం ఆ నోటీసు సారాంశం. తరువాత రాజారావుగారు కుసుమను దగ్గరకు పిలిచారు. ' కుసుమ నువ్వు బాగా ఆడతావుగా.. నీ పేరు ఇవ్వు. నీతో పాటు కొంతమందిని సెలెక్ట్ చేసుకో..' అని చెప్పారు. కుసుమ చురుకుతనం మీద ఆ మాస్టారికి నమ్మకం. ఆయన కేవలం చదువు, పరీక్షల్లో వచ్చే మార్కులనే చూడరు. జీవితం పరిపూర్ణం కావటానికి అన్నింట్లోనూ రాణించాలని అంటుంటారు. ఒక్కొక్కరు వారి ఆసక్తిని బట్టి ఒక్కో రంగంలో రాణిస్తారని, వారిని ఆ విధంగానే ప్రోత్సహించాలని ఆయన నమ్ముతారు. ఆచరిస్తారు. మాస్టారి మాటలకు కుసుమ ఉత్సాహపడింది. పిఇటిని కలిసి తన పేరు ఇచ్చింది. ఆరెండోరోజే మొత్తం టీమ్‌ను ఎంపిక చేశారు. టీమ్ లీడర్‌గా కుసుమనే పెట్టారు. తనకింత ప్రాముఖ్యత ఇవ్వటాన్ని చూసి, కుసుమ చాలా ఆనందపడింది. పట్టుదలగా ఆడి పాఠశాలకు పేరు తే వా ల ని అనుకొంది. పరీక్ష ల తర వాత ద సరా సెలవులు వచ్చాయి. కా నీ , కుసుమ బ్యా చికి స్కూలు గ్రౌం డులో శిక్ష ణ కొన సాగించా రు. కు సుమ ఎంతో ఉ త్సాహం గా పా ల్గొంటుం ది. కొంత మంది పిల్లలు ఆమెను హేళన చేశారు. నీకు ఆట లు తప్ప చదువు రాదు లే అని ఎకసెక్కంగా నవ్వా రు. కుసుమ ఓ క్షణం బాధపడినా –ఆ మాటలు పట్టించుకోలేదు. వాళ్లకు తన ఆటే సమాధానం చెప్పాలని అనుకొంది. మరింత పట్టుదల పెంచుకొని సాధన చేసింది. మెలకువలు తెలుసుకొంది. తన బృందంతో కలిసి రోజు ఉదయం, సాయంత్రం సాధన చేసింది. ఇంట్లో అమ్మానాన్నలకు కూడా ఇది అంతగా ఇష్టం లేదు. 'బిడ్డా.. ఇది మనకు కూడెడుతుందా? బట్టనిస్తుందా?' అంది అమ్మ. 'బాగా చదివి ఏదైనా ఉద్యోగం సంపాదించుకో అమ్మా.. ఇవి ఎందుకొచ్చిన ఆటలు?' అన్నాడు నాన్న. కుసుమ నవ్వుతూనే సమాధానం చెప్పింది. 'ఇలాంటి దేశానికి కూడా అవసరమే నాన్నా..' అంది. కబడ్డీ పోటీలు జరిగే రోజు రానే వచ్చింది. పిఇటిలో కలిసి కుసుమ బృందం పక్క ఊరికి వెళ్లింది. జిల్లా వ్యాప్తంగా అనేక స్కూళ్ల నుంచి బాలికల జట్లు వచ్చాయి. తొలిరోజు తొలి మ్యాచ్‌లో గెలవడం ఉత్సాహాన్నిచ్చింది. ఒక్కసారికి ఒక్కసారి తలపడటం కష్టం అనిపించినా– అన్ని మ్యాచుల్లోనూ విజయం సాధించి, ఫైనల్‌కు చేరుకొంది కుసుమ జట్టు. ఎంత ఉత్సాహంగా ఆడిందో, అంత ఉత్కంఠ కూడా మొదలైంది ఆ బ్యాచ్‌లో. ఆఖరి రోజు హెడ్‌మాస్టర్ సహా అందరు ఉపాధ్యాయులూ, తోటి విద్యార్థులు, తమ ఊరివారూ ఫైనల్ మ్యాచ్ చూడటానికి వచ్చారు. ఆ ఆటలు వద్దని నిరుత్సాహపరిచిన వారు సైతం కుసుమ జట్టు గెలవాలని ఉత్సాహపరచడం మొదలుపెట్టారు. ఆఖరికి హోరా హోరీలో కుసుమ జట్టు విజయం సాధించింది. ఆఖరిలో కీలకమైన పాయింట్లు సాధించ టంలో, జట్టును సమన్వయపర్చడంలో కుసుమ నైపుణ్యం, నాయకత్వ లక్షణం అందరికీ కళ్లకు కట్టినట్టు అర్థమైంది. జిల్లా స్థాయిలో తమ ఊరు గెలిచిందని గ్రామస్తులూ, పాఠశాల జట్టు విజయం సాధించి పేరు సంపాదించిందని హెడ్‌మాస్టారూ ఎంతో సంతోషించారు. తరువాత కుసుమ జట్టు రాష్ట్ర స్థాయికి ఎ ం పి క్కై ం ది. జా తీ య ం స్థాయిలో ఆడి రాష్ట్రానికి పేరు తె చ్చిం ది. జాతీయ స్థాయి విజయం సాధించిన సందర్భంగా ఓ రోజు ఆ స్కూలు ఆవరణలో కుసుమకు అభినందన సభ ఏర్పాటు చేశారు. 'కుసుమ ఈరోజు మన ఊరి పేరు జాతీయ స్థా యికి తీసుకెళ్లింది. ఆమె మన ఊరికి గర్వకారణం.' అని ఊరి పెద్దలూ, ఉపాధ్యాయులూ అభినందించారు. 'చదువు ఒకకటే కాదు; దాంతో పాటు మనం రాణించటానికి, సాధించటానికి అనేక రంగాలు ఉన్నాయి. పిల్లలు ఎవరూ ఏదీ సాధించని వారిగా మిగిలపోరు. ఒక్కొక్కరికి ఒక్కో నైపుణ్యం, ఆసక్తీ ఉంటాయి. వాటిని మనం గుర్తించి, ప్రోత్సహిస్తే–ఇదిగో, మన కుసుమ లాగానే వికసిస్తారు. తమకు, దేశానికి పేరు ప్రఖ్యాతులు తెస్తారు. నేను ఈ విషయాన్ని కుసుమ విజయం ద్వారానే గ్రహిం చాను..' అని హెడ్మాస్టరు సభావేదిక మీద ప్రకటిం చారు. ఊరందరి కరతాళ ధ్వానాలతో సభ కొద్ది నిమి షాల పాటు మార్మోగిపోయింది!

–శ్రీ వైష్ణవి

ఇంట్లో అమ్మానాన్నలకు కూడా ఇది అంతగా ఇష్టం లేదు. 'బిడ్డా.. ఇది మనకు కూడెడుతుందా? బట్టనిస్తుందా?' అంది అమ్మ. 'బాగా చదివి ఏదైనా ఉద్యోగం సంపాదించుకో అమ్మా.. ఇవి ఎందుకొచ్చిన ఆటలు?' అన్నాడు నాన్న. కుసుమ నవ్వుతూనే సమాధానం చెప్పింది. 'ఇలాంటి దేశానికి కూడా అవసరమే నాన్నా..' అంది. కబడ్డీ పోటీలు జరిగే రోజు రానే వచ్చింది. పిఇటిలో కలిసి కుసుమ బృందం పక్క ఊరికి వెళ్లింది. జిల్లా వ్యాప్తంగా అనేక స్కూళ్ల నుంచి బాలికల జట్లు వచ్చాయి. తొలిరోజు తొలి మ్యాచ్‌లో గెలవడం ఉత్సాహాన్నిచ్చింది.

ఆ ఆటలు వద్దని నిరుత్సాహపరిచిన వారు సైతం కుసుమ జట్టు గెలవాలని ఉత్సాహపరచడం మొదలుపెట్టారు. ఆఖరికి హోరా హోరీలో కుసుమ జట్టు విజయం సాధించింది. ఆఖరిలో కీలకమైన పాయింట్లు సాధించ టంలో, జట్టును సమన్వయపర్చడంలో కుసుమ నైపుణ్యం, నాయకత్వ లక్షణం అందరికీ కళ్లకు కట్టినట్టు అర్థమైంది. జిల్లా స్థాయిలో తమ ఊరు గెలిచిందని గ్రామస్తులూ, పాఠశాల జట్టు విజయం సాధించి పేరు సంపాదించిందని హెడ్‌మాస్టారూ ఎంతో సంతోషించారు.

అలవాటు అనేదాన్ని అరికట్టకపోతే, అది త్వరలోనే ఒక అవసరంగా మారిపోతుంది.-సెయింట్ ఆగస్టిన్










# యాంకరింగ్‌లో ఆరితేరిన రానా

నెం.1 ప్రోగ్రాం గా రానా నెం.1 యారి..! సగటు ప్రేక్షకుడిని ఆకట్టుకునేందుకు వెండితెర కు పోటీగా బుల్లితెర కూడా సిద్ధమయింది, హిందీ లో "కౌన్ బనేగా కరోడ్ పతి" అంటూ బిగ్ బి కోట్లాదిమంది ప్రేక్షకు లని ఆలరించటం తో టెలికాస్ట్ రంగంలో ఈ తరహా ప్రోగ్రాం లకు డిమాండ్ తో పాటు టి.ఆర్.పి రేటింగ్ సైతం ఊహించని స్థాయి లో పెరిగింది, అదే ప్రోగ్రాం ని మన తెలుగు లో కింగ్ నాగార్జున హోస్ట్ గా వ్యవహరించి భారీ హిట్ చేసిన సంగతి తెలి సిందే, ఇప్పుడు తెలుగు లో మన స్టార్ హీరో లు సైతం ఆ తరహా ప్రోగ్రాంలకు వ్యాఖ్యాతలుగా మార టంతో ఒక్కసారిగా సగటు అభిమా నులు కూడా హీరోల యాంకరింగ్ అంటూ ఈ మధ్యనే మన ముందుకు వచ్చాడు. ఇప్పుడు ఆ ప్రోగ్రాం నెం.1 ఎంటర్టైన్మెంట్ దిశగా సాగిపోవ టంతో రానా కు మరింత క్రేజ్ తోడ యిందనే చెప్పాలి. ప్రముఖులను, బెస్ట్ ఫ్రెండ్స్ ను తన హౌస్ కి గెస్ట్ లుగా పిలిచి సరదాగా వాళ్ళతో ముచ్చటించి, వాళ్ళ వాళ్ళ జీవితంలో జ్ఞాపకాలు, అల్లరులు గురించి తెలుసుకొని, స్నేహ బంధం అంటూ ఈ ప్రోగ్రాం కంటెంట్ సాగుతుంటుంది. ప్రతి ఆదివారం రాత్రి 8 : 30 నిమిషాలకు జెమినీ టివి లో ప్రసారమయ్యే ఈ నెం.1 యారికి, నెం.1 టి.ఆర్.పి రేటింగ్ లభిస్తుంది. కాగా వివో ఇండియా యు ట్యూబ్ చానెల్ మరియు వివో ఇండియా మొబైల్ అప్లికేషన్ లో లక్షల మంది వీక్షిస్తున్నారు. ఇప్పటికే దర్శక దిగ్గజం రాజమౌళి, నిర్మాత శోభు యార్లగడ్డ, అక్కినేని చైతన్య, సుమంత్, విజయ దేవరకొండ, దర్శకులు తరుణ్ భాస్కర్ వచ్చి అలరించారు. ముందు ముందు అఖిల్ అక్కినేని, ఎస్ ఎస్ కార్తికేయ మరెందరో ప్రముఖులు రానున్నారు. ఏది ఏమైనా సాధారణ ప్రేక్షకుడిని అలరించేది సినిమా అయినా, ప్రోగ్రాం అయినా ఖచ్చితంగా సూపర్ హిట్ అవుతది అని రానా అండ్ సంజీవ్‌కే కుమార్‌లు మరో సారి ఋజువు చేశారు. కాగా బిగ్ బాస్ అంటూ అతి తొందరలో జూనియర్ ఎన్టీఆర్ కూడా మన ముందుకు రానుండటం ఆనందదాయకం.

ముగ్దులు అయిపోతున్నారు. బాహుబలి లో బల్లాలదేవగా తన నటన తో విజృంభించిన నట చక్రవర్తి మన దగ్గుబాటి వారసుడు రానా దగ్గుబాటి. బాహుబలిలో రానా గొంతు వినటం కోసం మళ్లీ మళ్లీ సినిమా చూసిన అభిమానులు వున్నారంటే అది అతిశయోక్తి కాదు. పైగా రానా లుక్ అప్పిరెన్స్, బాడీ లాంగ్వేజ్, ఎనర్జీ, ఈజ్ ఏ స్థాయి లో ఉంటాయో యావత్ చిత్రసీమ బాహుబలి ద్వారా చూసింది. ఆ నమ్మకం తోనే ఢీ, క్యాష్, జబర్దస్త్, వంటి పలు ప్రోగ్రాం లు డైరెక్ట్ చేసి టెలివిజన్ అభిమానులను ఆకట్టుకున్న సంజీవ్ కే కుమార్ దర్శకుడిగా నెం.1 యారి

# మ్యాట్రిక్స్ మూవీ ఇప్పటికీ ఓ చరిత్ర








ది మ్యాట్రిక్స్ సిరీస్ ఎంత సూపర్‌డూపర్ హిట్ అయిందో అందరికీ తెలిసిందే! ఆర్ రేటెడ్ ఫిల్మ్ అన్నింటిలోకీ ఆ సిరీస్ సృష్టించిన రికార్డ్స్ గురించి ఎంత చెప్పినా తక్కువే! 1999లో ది మ్యాట్రిక్స్ సినిమా తర్వాత, ది మ్యాట్రిక్స్ రీలోడెడ్, ది మాట్రిక్స్ రివల్యూషన్స్ చిత్రాలూ వచ్చాయి. మ్యాట్రిక్స్‌లో నటించిన హీరో కియానూ రీవ్స్ నటజీవితంలో ఇదో గొప్ప అధ్యాయం అయింది. చిత్రం ఏమిటంటే, ది మ్యాట్రిక్స్‌లో హీరోగా నటించడానికి ముందుగా కియానూ రీవ్స్‌ను ఎంచుకోలేదంటే ఆశ్చర్యం అనిపిస్తుంది. ది మ్యాట్రిక్స్‌లోని హీరో నియో పాత్రను మొదట విల్‌స్మిత్‌కు ఆఫర్ చేశారు. ఇండిపెండెన్స్ డే, మెన్ ఇన్ బ్లాక్ చిత్రాల విజయం తర్వాత, యాక్షన్ హీరోగా విల్‌స్మిత్ అంటే ప్రేక్షక ప్రపంచం పడి చచ్చిపోతున్న రోజులవి. ది మ్యాట్రిక్స్ పాత్ర గురించి విన్నాక, విల్‌స్మిత్ పెదవి విరిచేసి ఆ, ఈ పాత్రలో ఏముంది? పనికిమాలిన ఇలాంటి చెత్త సైన్స్ ఫిక్షన్ సినిమాలో నేను చెయ్యను అంటూ ఆ పాత్రను తిరస్కరించాడు. అదే సమయంలో ఆయన ఒప్పుకున్న వెల్డ్ వెల్డ్ వెస్ట్ చిత్రం కాస్తా అట్టర్ ఫ్లాప్ అయి కూర్చుంది. మరో విశేషం ఏమిటంటే, నికొలస్ కేజ్‌కూడా ఈ పాత్రను వద్దనటం! దురదృష్టం అదేనేమో!

## మీకు తెలుసా...?

ఒక్కసారిగా భారత్ వైపుచూడటం ఒక ప్రత్యేకత. ఇజ్రాయిల్‌కు భారత్ పట్ల అంత అభిమానం ఎందువల్లనో మనకు తెలియాలంటే ఇది చదవాల్సిందే...





# మనకు కాశీ ఎలాగో ఇజ్రాయిల్‌కు భారత్ అలా.....!

ప్రపంచంలో చిన్న దేశాలలో ఇజ్రాయిల్ ఒకటి. ప్రపంచం మొత్తంలో సాంకేతికంగా అత్యంత శక్తిశాలి ఇజ్రాయిల్. ఇజ్రాయిల్‌ను జయించడం పక్కన పెడితే ఆదేశం వైపు కన్నెత్తి చూసే దమ్ము, ధైర్యం కూడా ఏదేశానికి లేవనేది అక్షరసత్యం. అటువంటి దేశానికి గత 30 ఏళ్లుగా ఏ భారత ప్రధాని వెళ్లలేదు. దానికి అనేక కారణాలు. ఈమధ్యనే భారత ప్రధాని మోదీ ఇజ్రాయిల్ ను పర్యటించారు. ఇజ్రాయిల్ దేశం యావత్తు అత్యంత గౌరవ మర్యాదలతో మన ప్రధానిని ఆహ్వానించడంతో ప్రపంచం అంతా ఒక్కసారిగా భారత్ వైపుచూడటం ఒక ప్రత్యేకత.

### ఇజ్రాయల్ దేశం గురించి వాస్తవాలు...

ప్రపంచంలోని అతిచిన్న దేశాల్లో ఇజ్రాయల్ ఒకటి. వైశాల్యం కేవలం 20,300 చ.కిమీ. అంటే మన అనంతపురం జిల్లా అంత పరిమాణం. అక్కడ సంవత్సర వర్షపాతం కేవలం 550 మి.మీ. అంటే అదీ మన అనంతపురంతో సరిగ్గా సమానం. కాని అక్కడ ఉన్నది ఎడారి ఇసుక నేల మాత్రమే. ఎటువంటి నదులూ లేవు. ఎటు చూసినా ఎడారి, తన చుట్టూ ఏడు కరడుగట్టిన ఉగ్రవాద ఐసిస్ ప్రభావిత శతృదేశాలు, ఒక ప్రక్క మధ్యధరా సముద్రం..ఆ సముద్రపు నీటినే వారు ప్రాసెస్ ద్వారా మంచినీరుగా మార్చి, ఆనీటితోనే మట్టితో అవసరం లేకుండానే (అంటే నేలతో అవసరం లేకుండా నీటికి పోషకాలు అందించి పంటలు పండించటం) అనే విధానంలో వ్యవసాయం చేసి ప్రపంచంలోనే అత్యధిక దిగుబడి తీసే దేశంగా గుర్తింపు పొందారు. ఈ విధానాన్ని కూడా వారే ప్రపంచానికి అందించారు. దేశం మొత్తం జనాభా కేవలం 87 లక్షలు..100% అక్షరాస్యత. అందరూ గ్రాడ్యుయేట్స్ లేదా పోస్ట్ గ్రాడ్యుయేట్స్..చదువు పూర్తిఅయిన తరువాత కనీసం 2 లేక 3 సంవత్సరాలు ప్రతి ఒక్కరు దేశ రక్షణ కొరకు సైన్యంలో పనిచేయాలి (ప్రధాని/దేశాధ్యక్షుని పిల్లలు సైతం)..అక్కడ ఎవరూ ఖాళీగా ఉండరు. అడుక్కునేవారు అసలే ఉండరు. అడుక్కునేవారికి బిక్ష వేసి ప్రోత్సహించేవారు అసలసలే ఉండరు. ఇజ్రాయల్ ఒకదేశంగా 1948 లో ఏర్పడింది. 2000 సంవత్సరాల క్రితం ఏసుక్రీస్తును సిలువ వేసినది యూదులు అనే ఒక ప్రత్యేక/ప్రాచీన తెగ వారు. తరువాత జరిగిన పరిణామాల కారణంగా వారిని కనబడినవారిని కనబడినట్లుగా చంపివేశారు. దీనితో వారు తమ ప్రాంతం వదలి ప్రాణరక్షణ కోసం ప్రపంచం నలుమూలలకు పారిపోయారు. ఎక్కడికెళ్ళినా అక్కడా అదేవిధంగా ప్రాణాలు కోల్పోయారు. ఒక్క మన దేశానికి వచ్చినవాళ్ళు మాత్రమే సురక్షితంగా బ్రతికి తమ జాతిని కాపాడుకున్నారు. ఈవిధంగా 2000 సంవత్సరాలు తమకంటూ ఒక దేశం లేకుండా బ్రతికిన యూదులు 1948 లో అమెరికా-బ్రిటన్ సహాయంతో తిరిగి తమ ప్రాంతానికి వచ్చి ఇజ్రాయల్ అనే దేశాన్ని ఏర్పాటుచేసుకున్నారు. ఇజ్రాయల్ రాజ్యాంగం మొదటి పేజీలో ఇలా ఉంటుంది: యూదు జాతీయులను ఆదరించి, అక్కున చేర్చుకున్న భారతదేశానికీ-భారతీయులకూ ఎప్పటికీ రుణపడి ఉంటాం. ఇంతెందుకు మన ప్రియతమ ప్రధాని మోదీజీ ఆ దేశానికి ఇంత ప్రాధాన్యతనిస్తున్నారంటేనే అర్థంచేసుకోవచ్చు... అని !!ప్రతి యూదు జాతీయుడూ తన మొదటి సంపాదనతోగాని లేక జీవితంలో ఎప్పుడైనా తప్పకుండా భారతదేశానికి వచ్చి ఇక్కడి నేలను తాకి ముద్దాడి తమదేశంతో సమానంగా భారత్ కూ రుణపడి ఉంటానని కృతజ్ఞతలు చెప్పుకుని



వెళతారు. ప్రతి హిందువు తన జీవితకాలంలో కనీసం ఒక్కసారైనా కాశీకి వెళ్ళి గంగలో మునిగి విశ్వనాధుణ్ణి సేవించాలని ఎలా ఆరాటపడుతాడో అలా....!!

# సర్వాంతర్యామి జ్యోతిష్యం

(గత సంచిక తరువాయి భాగం)

శివుని సగదేహ మున విలీనమైనది పార్వతి, విష్ణువు నాభినుంచి ప్రభవిం చినవాడు బ్రహ్మ. బ్రహ్మ నాలుకపై నర్తించునది సరస్వతి. శివ పార్వ తులు, శ్రీవిష్ణువుల వలె 4 నక్షత్ర ములు తిరుగుచు ఒకే నక్షత్రమువలె బ్రహ్మ జ్ఞానవునందించుచున్నారు. మరణభయాన్ని పోగొట్టేది స్వర్ణధారణము, విభూది లేపనము. కనుకనే ఆత్మహత్యా భావానికి స్వర్ణముతో తయారుచేసిన నేత్రమ్మూర్ అను హోమియో మందును వాడతారు.

ఇక 7వ. నక్షత్రం పునర్వసు :- పునర్వసు సమతులాచక్రం పంచ. ఇది 5 నక్షత్రాలతో కూడి యున్నది. ఈ నక్షత్రాధిపతి అదితి. ఇది రాముని జన్మ నక్షత్రం. రామకళ్యాణం చేస్తారు. సంవత్సర ప్రారంభం నుండి రామనవమి వరకు నవ'రాత్రులు జరుపుతారు. వీటిని వసంత నవరాత్రులంటారు. ఆ తర్వాత 6 నెలలకు శరన్న వరాత్రులు జరుపుతారు. ఆరోగ్యరీత్యా నీటి కాలుష్య నివారణ చర్య. ఈ నక్షత్రం ఉపనయనానికి పనికిరాదు. జ్ఞానాన్ని వికసించనీయదు. మృగ'శిరార్ధం ఆర్ద్ర పునర్వసు త్రయోః మిథునం. (మృగశిర 3,4, పాదాలు ఆర్ద్ర 1,2,3,4 పాదాలు పున ర్వసు 1,2,3 పాదాలు మిధునరాశిలో ఉంటాయి) మిధునా నికి నృయుగ్మం -మనుష్యుల జంట, జితుమం-గొప్ప జయం కలది మొద లగు నామౌచిత్య పదాలు పర్యాయ పదాలైనవి. ఈ రాశి వీణను ధరించిన దంపతుల స్వరూపము కలిగి యున్నది. ఈరాశి వారిది వ్యతిరేక స్వభావం. ద్వంద వైఖరి. వాయు తత్వం, తమోగుణం. నలుపు రంగు. ఈ మిధునరాశికి బుధుడు అధిపతి.

8వది పుష్యమి :- సరళా పుష్యమీ త్రీణి . మూడు నక్షత్రములుం డును. ఈ నక్షత్రానికి బృహస్పతి అధిపతి,

అశ్విన్ అర్ధాః ఇతి పుష్య : పుష్యా సర్వార్ధ సాధకళా: ఈ నక్షత్రం గృహప్రవేశ ముహూర్తా నికి పనికిరాదు. సుఖాన్ని నశింప చేస్తుంది. కృషి శీలతను పెంచుతుంది.

తొమ్మిదవది ఆశ్లేష:-ఆశ్లేషా సర్పా బుతూ. సర్పాకృతిలో 6 నక్షత్రాలు కలిసి వుంటాయి. ఈ నక్షత్రాధిపతి సర్పం. అంటే పాములు అధిష్ఠాన దేవతలు. శుభ కార్యాలకు ఈ నక్షత్రం పనికి రాదు.

పునర్వసు పాదం పుష్యమి ఆశ్లేషాంత్యం కర్కాటకం. (పున ర్వసు 4వ పాదం, పుష్యమి 1,2, 3,4 పాదాలు, ఆశ్లేష 1,2,3,4 పాదాలు కర్కాటక రాశిలో వుం టాయి.)

ఇక రాశి నామఔచిత్యానికి వస్తే కర్కాటకం అనగా పుట్టినపుడు తల్లిని చంపునది - పీత, కుళీర :- భూమి యందు వుండేది. నిచళీ, ఝుమాన నునవి జ్యోతిష్య శాస్త్రంలో వాడుకలో వున్న పేర్లు. కర్కాటకం ఎండ్రకాయ స్వరూపంలో వుంటుంది. ఈ రాశిలో జన్మించిన వారికి త్వరత్వరగా పనిచేసే స్వభావం వుంటుంది. గుం డ్రని మొహం కలిగివుంటారు. జల తత్వం సత్వగుణం, తెలుపు రంగు. కర్కాటక రాశ్యాధిపతి చంద్రుడు.

(జులై 2 నాటి తరువాయి భాగం)

2. భూమి :- భూమి ఆత్మ భ్రమణం సెకనుకు 30కిలో మీటర్లు. నిమిషానికి 1,800కి.మీ. సంవత్సరానికి 96,60,00,000కి.మీ. వేగంతో పశ్చిమం నుండి తూర్పు వైపుకు తిరుగుతూ వుంటుంది. కనుకనే ఆకాశంలో సూర్యుడు, ఇతర నక్షత్రాలు, గ్రహాలు తూర్పు నుండి పశ్చిమానికి కదులుతున్నట్లు కనపడతాయి. భూమి గోళాకారంలో వుండటం వల్ల తన చుట్టు తాను తిరగటంలో కొంచెం వంగి తిరుగుతుంది. ఈ వంగడం కక్ష్య యొక్క తలానికి 23 1/2డిగ్రీల దూరంలో వుంటుంది.

చంద్రుడు :- చంద్రుడు భూమికి పుపగ్రహం. భూభ్రమణం వల్ల చంద్రుడు కూడా ఆకాశంలో తూర్పు నుండి పడమరకు తిరుగుతున్నట్లు కనిపిస్తాడు. ఒకసారి భూమి చుట్టూ పూర్తిగా తిరిగి రావడానికి పట్టే కాలం 27 రోజుల 7 గంటల 43 నిమిషాలు.అంటే 27.3217 రోజులు. అయితే ఒక అమావాస్య నుండి మరొక అమావాస్యకు పట్టే కాలం మాత్రం 29.5305887రోజులు. చంద్రుడు ఒక వలయం పూర్తి చేసుకొనేసరికి రవి కూడా గమనం లో ముందుకు వెళ్తాడు. అందువల్ల సాధారణ సమయం కన్నా కొంత ఎక్కువ సమయం చంద్రునికి అవసరమవుతుంది.

3. బుధుడు :- రవి వరుసలోని మొదటి కక్ష్యలోని గ్రహం ఇది. ఈ బుధుడు సూర్యుని చుట్టు తిరగడానికి 88 రోజులు పడుతుంది. తన చుట్టూ తాని తిరగడానికి 58 రోజుల 15 గంటలు పడుతుంది. దీని పరిధి 3,000 మైళ్ళు వుంటుంది.

4.శుక్రుడు :- ఇది రవి కక్ష్య లో రెండవది. దీని పరిధి 7,500 మైళ్ళు. తనచుట్టుతాను తిరగడానికి 243 రోజులు, సూర్యుని చుట్టూ తిరగడానికి 224.7 రోజులు పడుతుంది.

5. కుజుడు :- ఇది 4 వ గ్రహము. దీని పరిధి 4,200 మైళ్ళు. తన చుట్టూ తాను తిరగడానికి 24 గంటల 37 నిమిషాలు, సూర్యుని చుట్టు తిరగడానికి 687 రోజులు పడుతుంది. సౌర మండలంలోకెల్లా ఎత్తన అగ్ని పర్వతం వుంది. దాని పేరు ఒలింపస్ మాన్స్.ఇది ఎవరెష్టు శిఖరం కన్న మూడింతలు పెద్దది.

6. గురువు : - గురు గ్రహం తన చుట్టు తాను తిరగడానికి ఒక గంట 50 నిమిషాలు పడుతుంది.సూర్యుని చుట్టూ తిరిగి రావడానికి 11.86 సంవత్సరాలు పడుతుంది. ఇది సౌర కుటుంబములో అతి పెద్ద అతి బరువైన గ్రహం. దీనికి16 వుపగ్రహాలున్నాయి.

7; శని : - భూ కక్ష్య లో ఇది ఆరవ గ్రహం. దీనికి దాదాపు 20 వుపగ్రహాలున్నాయి. తన చుట్టు తాను తిరగడానికి 10 గంటల 14 నిమిషాలు సూర్యుని చుట్టూ తిరగడానికి 29.46 సంవత్సరాలు పడుతుంది. దీని పరిధి 74,000 మైళ్ళు.

యురేనస్: : - ఈ గ్రహం 1781 లో విలియం హెర్షల్ చేత కనుగొనబడింది. దీనికి 5 వుపగ్రహాలున్నాయి. దీని పరిధి 32,000 మైళ్ళు. తనచుట్టు తాను తిరగడానికి 16 గం. 10 ని లు పడుతుంది. సూర్యుని చుట్టు తిరగడానికి 84.01 సం లు పడుతుంది.

నెప్ట్యూన్ :-ఇది 1846లో కనుగొనబడింది. తన చుట్టూ తాను తిరగడానికి 18 గంటల 26 నిమిషాలు, సూర్యుని చుట్టూ తిరగడానికి 164.8 సంవత్సరాలు పడుతుంది.

ఫ్లూటో : - ఇది సౌర కుటుంబ గ్రహాల కక్ష్యలో 9వ ది. ఇది 1930 లో క్లైడె టంబాగ్ చేత కనుగొన బడింది. దీని పరిధి 1800 మైళ్ళు. ఆత్మ భ్రమణ కాలం 6 రోజుల 9 గంటలు. సూర్య పరిభ్రమణ కాలం 247.7 సంవత్సరాలు.

ఉపగ్రహాలు:- రవికి - కాలము, భూమికి- చంద్రుడు, చంద్రునికి-పరివేషము, బుధునికి-అర్ధప్రహారము, గురువుకి 16 వుపగ్రహాలున్నాయి. అవి 1,మెతిస్, అడ్రాస్టియా, అమత్తియా, ధేచ, అయో, యూరోపా, గానిమీడ్, కలిస్టో, లీడా, హిమాలయా, రైసిథియా, ఎలారా,అనాంకే, కార్మే, పాసిఫీ, పినోసా, ఇక శుక్రునికి - కోదండం, శనికి - దాదావు 20 ఉపగ్రహాలు, యురేనస్ కి 5 వుపగ్రహాలు అవి 1. మిరండా, ఏరిమెల్, ఆండ్రియల్, టిటటానియా, ఓబ రాన్. నెప్ట్యూన్ కి రెండు అవి ట్రైటిన్, నైరెడ్. ఫ్లూటో కి షరాన్ మొదలగునవి.

డా. వి.వి రవి - వి. భానుమతి
శ్రీపొట్టిశ్రీరాములు తెలుగు యూనివర్శిటీ
సెల్ నం. 95732 51184



అంతా నిన్ను అవమానిస్తున్నప్పుడు, వినయంగా వుండడం మంచిది కాదు. కానీ అందరూ నిన్ను ప్రశంసిస్తూన్నప్పుడు వినయంగా వుండడం మాత్రం చాలా అరుదయిన విషయం. -సెయింట్ బెర్నార్డ్



# గాయని
## సోని కోమండూరి

**లిటిల్ మ్యూజిషియన్స్ అకాడమీ నుండి వచ్చిన మరో ఆణిముత్యం సోనీ కోమండూరి. కోమండూరి అనగానే మీకు ఇప్పటికే ఓ అనుమానం ప్రముఖ సంగీత అధ్యాపకుడు, గాయకుడు, సంగీత దర్శకుడు కోమండూరి రామాచారి గారికి ఏమవుతారా అని కదా..!**








సోని కోమండూరి
తండ్రి ; రామాచారి
తల్లి ; సుజాత
సంగీతం అభ్యసించింది
లైట్ మ్యూజిక్ ; లిటిల్ మ్యూజిషియన్స్ అకాడమీ
క్లాసికల్ మూజిక్ ; శ్రీనిధి వెంకటేష్
హిందూస్థాన్ ; అపూర్వ గజ్జల
రంగప్రవేశం ; జీ సరిగమప లిటిల్ ఛాంపియన్స్

నిజమే మీరు ఊహించింది రామాచారి గారి అమ్మాయి ఈ సోని కోమండూరి. తండ్రికి తగ్గ తనయురాలుగా పేరు సంపాదించుకోవాలనే తపన. సంగీతంపై ఉన్న మక్కువ వెరసి సోని మంచి గాయనిగా గుర్తింపు పొందింది. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన బాహుబలి సినిమాలో తానూ ఓ భాగం అయినందుకు గర్వపడుతున్నానని సూర్య ఆదివారం అపరంజి కోసం ఇంటర్వ్యూలో తెలిపారు. బాహుబలి సినిమాలో హంసనావ అనే పాటకు ట్రాక్ పాడాను అది బాగుండటంతో సినిమాలో అలానే వుంచడం ఊహించలేదు. బాగా పాప్యులారిటీ సాధించింది. మంచి గుర్తింపుకూడా పొందింది. కీరవాణి గారు మ్యూజిక్‌లో యమదొంగ, విక్రమార్కుడు సినిమాలకు కోరస్ ఇస్తుండేదాన్ని. జీటివిలో సరిగమప లిటిల్ ఛాంపియన్స్‌తో తన పాటల ప్రస్థానాన్ని ప్రారంభించిన సోని కోమండూరి ప్రస్తుతం కమ్యూనికేషన్స్ అండ్ జర్నలిజంలో డిగ్రీ కోసం రెండవ సంవత్సరం చదువుతున్నారు. శ్రీనిధి వెంకటేష్, అపూర్వ గజ్జల దగ్గర సంగీత శిక్షణను అభ్యసించానని చె ప్పారు.

చిన్నప్పటినుంచీ పాటలు పాడటం, దేశ విదేశాలలో అనేక కచేరీలు చేసాననీ కొన్ని కోరస్ పాటలు కూడా పాడాన న్నారు.

కోటిగారు సంగీతం చేసిన మనోరమ సినిమాకోసం పానీపూరి పాట నా కేరీర్‌లో మొదటి సోలో పాటగా అనుకోవచ్చు. కోటి, మణిశర్మ, విజయ్‌కారాకుల లాంటి ప్రముఖ సంగీత దర్శకుల వద్ద బిట్ సాంగ్స్ మరియు మెయిన్ సాంగ్స్‌కూడా పాడానని సూర్య చేసిన ఇంటర్వ్యూలో తెలియజేసారు సోనీ కోమండూరి. మంచి గాయనిగా పేరు సంపాదించాలని తన ఆకాంక్షగా తెలిపారు. తనకు సుశీల, చిత్ర, శ్రేయాఘోషల్ వంటి ప్రముఖ గాయనీమ ణులు స్ఫూర్తి అని తెలియజేసారు. ఏ మ్యూజిక్ డైరక్టరంటే ఇష్టమంటే అందరి ప్రముఖ సంగీత దర్శకుల వద్ద పాడాలని ఉందిని సోని చెప్పారు. మరో ప్రశ్నకు సమాధానమిస్తూ తాను రామాచారి కూతురిగా పుట్టడం తన పూర్వజన్మసుకృతంగా భావిస్తున్నానన్నారు.

సోనీ అసలు పేరు సాహితి. కీరవాణి సోనీ మార్చారు. పాటలంటే మక్కువ ఎక్కువన్న సోనీకి యాంక రింగ్ అంటే కూడా ఇష్టమని తెలిపారు. సోనీ కోమండూరి భవిష్యత్తులో మంచి పాటలతో పాటుగా యాంకర్‌గానూ పేరు ప్రఖ్యాతులు గడించాలనీ తన ఆకాంక్ష నెరవేరాలని సూర్య అపరంజి కోరుకుంటున్నది.









పరిపాలించడంకన్నా, ఒకరికి విధేయుడుగా వుండటమే అన్ని విధాల ఉత్తమం. -థామస్ ఎ.కెంపిస్

# జనం కోసం జస్టిస్

## అంతర్జాతీయ న్యాయా దినోత్సవం



**అంతర్జాతీయ న్యాయ దినోత్సవం..దీనినే అంతర్జాతీయ క్రిమినల్ జస్టిస్ దినోత్సవం అని కూడా పిలుస్తారు. ప్రపంచ వ్యాప్తంగా జూలై 17 న అంతర్జాతీయ న్యాయ దినోత్సవాన్ని జరుపుకుంటాం. అంతర్జాతీయ క్రిమినల్ జస్టిస్ వ్యవస్థకు గుర్తింపుగా ఈ ఉత్సవాన్ని జరుపుకుంటున్నారు.**

- ★ జూలై 11..అంతర్జాతీయ న్యాయ దినోత్సవం
- ★ దేశంలో గుట్టల్లా పేరుకు పోతున్న పెండింగ్ కేసులు
- ★ ప్రజల్లో న్యాయవ్యవస్థపై సన్నగిల్లుతున్న నమ్మకం
- ★ ట్రైయల్స్‌లో ఉన్న క్రిమినల్ కేసులు 77,50,856
- ★ దేశంలో పెండింగ్‌లో ఉన్న కేసులు 2,41,47,468
- ★ ఏపీలో పెండింగ్‌లో ఉన్న సివిల్ కేసులు 4,33,391
- ★ తెలంగాణలో పెండింగ్‌లో ఉన్న కేసులు 3,38,780

రెండో ప్రపంచ యుద్ధం తరువాత నాజీ యుద్ధ నేరాలపై దర్యాప్తు జరిపిన ఒక పరిశోధకుడు అమెరికా సంయుక్త రాష్ట్రాల ఆర్మీ ప్రధాన న్యాయవాదిగా వ్యవహరించిన బెంజమిన్ బి. ఫెరెంజ్... ఒక అంతర్జాతీయ చట్ట పాలన, ఒక అంతర్జాతీయ క్రిమినల్ న్యాయస్థానం ఏర్పాటుకు చేయాల్సిన వసరాన్ని నొక్కి వక్కాణించారు. అంతే కాదు 1975లో ప్రచురించిన 'డిఫైనింగ్ ఇంటర్నేషనల్ అగ్రెషన్ – ది సెర్చ్ ఫర్ వరల్డ్ పీస్' అనే తన మొదటి పుస్తకంలో, ఒక అంతర్జాతీయ న్యాయ స్థానం ఏర్పాటు ప్రాముఖ్యతను ప్రస్తావించారు. 1989లో ఈ ఆలోచన పునరు జ్జీవనం పొందింది. అంతర్జాతీయ సమాజం... యుగోస్లావియా, రువాండాల్లో యుద్ధ నేరాలపై విచారణ జరిపేందుకు న్యాయస్థానాలు ఏర్పాటు చేసింది. దీంతో ఒక శాశ్వత అంతర్జాతీయ క్రిమినల్ న్యాయస్థానం ఏర్పాటు అవసరం మరింత ప్రాధాన్యత పొందింది. తరువాత సంవత్సరాల్లో దీనిపై చర్చలు జరిగాయి, ఒక ఒప్పందాన్ని ఖరారు చేసే లక్ష్యంతో ఐక్యరాజ్యసమితి సాధారణ సభ జూన్ 1998లో రోమ్ నగరంలో ఒక సదస్సును ఏర్పాటు చేసింది. జులె 17, 1998న అంతర్జాతీయ క్రిమినల్ న్యాయ స్థానం రోమ్ శాసనం, 120 – 7 ఓట్ల తేడాతో ఆమోదిం చబడింది. అయితే 21 దేశాలు ఈ ఓటింగ్‌కు దూరంగా ఉండగా.. చైనా, ఇరాక్, ఇజ్రాయెల్, లిబియా, ఖతర్, యునెటెడ్ స్టేట్స్, యెమెన్ దేశాలు ఒప్పందానికి వ్యతిరేకంగా ఓటు వేశాయి. ఏప్రిల్ 11, 2002న రోమ్ శాసనం ఒక బంధన ఒప్పందంగా మారింది, ఈ సమయానికి దీనిని ఆమోదించిన దేశాల సంఖ్య 60. ఇంటర్నేషనల్ క్రిమినల్ కోర్ట్ సృష్టికి కారణమయిన ఒడంబడిక రోమ్ స్టాట్యు ' వార్షికోత్సవము కారణముగా జూలై 17 వ తేదీని ఇంటర్నేషనల్ జస్టిస్ డే గా జడరుపుకుంటున్నారు. ఇంటర్నేషనల్ క్రిమినల్ కోర్ట్ (ఐ.సి.సి.) రోమ్ స్టాట్యు పదవ వార్షికోత్సవం సందర్భంగా 2008 లో ఇంటర్నేషనల్ జస్టిస్ డేను సెలబ్రేట్ చేశారు. గతంలో ఆయా దేశాల్లో వివిధ తేదీలలో న్యాయదినోత్సవాలు జరిగేవి. అయితే రెండు సంవత్సరాలుగా సమిస్టిగా జూలై 17 న అంతర్జాతీయ న్యాయదినోత్సవాన్ని జరుపుకుంటున్నారు.

### మన దేశంలో న్యాయదినోత్సవం..

మన దేశంలో జూలై 17న అతర్జాతీయ న్యాయ దినోత్సవం నిర్వహించడమే కాకుండా నవంబర్ 26 న జాతీయ న్యాయ దినోత్సవం జరుపుకుంటాం. కాగా జాతీయ న్యాయ దినోత్సవం 1950 జనవరి 26 వ తీదీ నుంచి అమల్లోకి వచ్చింది. అంతర్జాకతీయ న్యాయ దినోత్సవమైనా, జాతీయ న్యాదినోత్సవమైనా .. చట్టము ముందు అందరూ సమానమేనని తెలిలజేయడం, సత్వర న్యా యము కోసము కృషి చేయడం అనే ది ఎా టం ముఖ్య ఉద్దే శ్యాలు. ప్రభుత్వాల



చట్టాలు ప్రజా వ్యతి రేకముగా ఉన్నా, రాజ్యాంగాన్ని అతిక్రమించేవిగా ఉన్నా అవి చెల్లవని చెప్పే అధికారము రాజ్యాంగ ధర్మాసనాలకు ఉన్నది .. సుప్రీం కోర్టు ఇచ్చే తీర్పులకు కూడా చట్ట హోదా ఉం టుంది. వివిధ రాజ్యాంగ వ్యవస్థల్లోకెల్లా న్యాయవ్యవస్థ సర్వోన్నతమెనది.

### స్వతంత్ర ప్రతిపత్తి...

న్యాయవ్యవస్థ స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడేందుకు రాజ్యాంగంలో ప్రాధాన్యం ఇచ్చారు. ఈ విషయంలో ఆర్టికల్ 124 న్యాయవ్యవస్థకు అండగా నిలుస్తుంది. ఉన్నతస్థాయిలో న్యాయమూర్తి పదవీకాలంలో ఆయనకు హాని కలిగించే విధంగా జీతభత్యాలను తగ్గించేందుకు, ఇతర సర్వీస్ కండిషన్స్ మార్చేందుకు వీల్లేదు. విధి నిర్వహణ నుంచి తొలగించే వీలులేదు. అలా తొలగించాల్సి వస్తే పార్లమెంట్ అభిశంసన ప్రక్రియ పూర్తి కావాల్సిందే. పార్లమెంట్‌లో మూడింట రెండు వంతుల మెజారిటీతో అభిశంసన తీర్మానం ఆమోదం పొందాలి. అంతమాత్రాన ఈ విధమెన స్వతంత్ర ప్రతిపత్తి న్యాయమూర్తులు ఇష్టారాజ్యంగా వ్యవహరించేందుకు వీలు కల్పించిందని భావించనక్కర్లేదు.

### దేశంలో గుట్టల్లా పెండింగ్ కేసులు..

ఒకప్పుడు కేసుల పరిష్కారంలో జరుగుతున్న జాప్యానికి న్యాయమూర్తుల కొరత, ఆ వ్యవస్థ లో సిబ్బంది కొరత అని మాత్రమే భావించేవారు. తాజాగా ఈ జాప్యానికి మరో కొ త్త కారణం కూడా తోడైంది. అవినీతి వల్ల కూడా కేలుసు జాప్యం జరుగుతుందన్న వాదనలు వినిపిస్తున్నాయి. కారణాలేవైనా.. దేశంలో వివిధ న్యాయస్థానాల్లో మొత్తం 77,50,856 క్రిమినల్ కేసులు ట్రైయల్స్‌లో ఉన్నాయి. 2,41,47,468 సివిల్ కేసులు పెండింగ్‌లో ఉన్నాయి.దేశంలో ఏళ్ళ తరబడి పరిష్కారం నోచుకోని కేసుల వివరాల్లోకి వెళితే.. పదేళ్ళ కాలంగా పెండింగ్‌లో ఉన్న కేసులు 22.63 లక్షలు. ఐదేళ్ళు దాటినా పరిష్కారానికి నోచుకొని కేసులు 39.63 లక్షలు. రెండు నుంచి ఐదేళ్ళు మధ్యకాలంలో పరిష్కారానికి రాని కేసులు 70.50 లక్షలు పెండింగ్‌లో ఉన్నాయి. రెండు సం వత్సరాలుగా పరిష్కారం కానీ కేసులు మొత్తం 1.09 కోట్లు పెండింగ్‌లో ఉన్నాయి. దేశంలో అత్యధికంగా ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో 53,63,613 కేసులు పెండింగ్‌లో ఉండగా, మహారాష్ట్రలో 31,54,681 కేసులు పెండింగ్‌లో ఉన్నాయి. ఇక తెలుగు రాష్ట్రాలయిన ఆంధ్రప్రదేశ్‌లో 4,33,391 సివిల్ కేసులు పెండింగ్‌లో ఉండగా తెలంగాణలో 3,38,780 కేసులు వివిధ కోర్టులలో పెండింగ్‌లో ఉన్నాయి. అదే క్రిమినల్ కేసులల్లో ఆంధ్రప్రదేశ్‌లో 2,47,288 కేసులు పెండింగ్‌లో ఉండగా, తెలంగాణలో 1,87,244 కేసులు పరిష్కారానికి నోచుకుండా మూల్గుతున్నాయి.

### న్యాయమూర్తుల కొరత..

దేశంలో కేసుల పరిష్కారంలో జాప్యానికి న్యాయమూర్తులు, సిబ్బంది కొరత ప్రధాన కారణంగా చెప్పుకోవచ్చు. ప్రస్తుతం మన దేశంలో సుప్రీంకోర్టులో ఐదు ప్రధాన న్యాయమూర్తుల పోస్టులు ఖాళీగా ఉండగా వివిధ హైకోర్టులలో 43 శాతం న్యాయమూర్తుల పోస్టులు భర్తీ కాకుండా ఉన్నాయి. అలాగే జిల్లా కోర్టులలో 21,017 న్యాయమూర్తులకు గాను 19.82 శాతం పోస్టులు ఖాళీగా ఉన్నాయి. పదిలక్షల మంది జనా భాకు 50 మంది న్యాయమూర్తులు ఉండాలని 1987 లో లా కమీషన్ సిపార్సు చేసింది. అయితే ప్రస్తుతం దేశ జనాభా శరవేగంగా పెరుగుతున్నది.
దానికి సరిపడా న్యాయమూర్తులు ఉన్నట్లు కనబడటం లేదు. మన దేశంలో న్యాయమూర్తుల విషయం ఇలా ఉండగా అభివృద్ధి చెందిన దేశా లల్లో మాత్రం జనాభాకు తగ్గట్లు న్యాయమూర్తులు ఉన్నారు. ఫ్రాన్స్ లో 10 లక్షల మందికి 124 మంది న్యాయమూర్తులు ఉండగా అమెరికాలో 108 మంది న్యాయమూర్తులు ఉన్నారు. ఆస్ట్రేలియాలో 40 మంది న్యాయమూర్తులు ఉండగా కెనడాలో 33 మంది, ఇంగ్లాండ్‌లో 22 మంది న్యాయ మూర్తులు ఉంటే మన భారతదేశంలో 10 లక్షల మంది జనాభాకు 17 మంది న్యాయమూర్తులే ఉన్నారు. అంటే ఇతర దేశాలతో పోల్చుకున్నప్పుడు మనదేశంలో జనాభాకు అనుగుణంగా న్యాయ మూర్తులు లేరన్నమాట. ఇది ఇలా ఉంటే 2010 లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా ఉన్న వి.వి. రావు, ఒకానొక సందర్భంలో మాట్లాడుతూ దేశంలో ప్రస్తుతం ఉన్న కేసులు పరిష్కా రం కావాలంటే బహుశా 320 సంవత్సరాలు పడుతుందేమో అన్న సందేహం వ్యక్తం చేశారు. అయితే ప్రస్తుత పరిస్థితులు పరిస్థితి చూసినట్లయితే వి.వి రావు గారి మాటలు నిజమౌతా యేమోనని అనిపిస్తుంది.

### న్యాయ వ్యవస్థకు అవినీతి మకిలి

దేశంలోని వివిధ రాజ్యాంగ వ్యవస్థల్లో న్యాయవ్యవస్థను సర్వోన్నతమైంది. కాని అవినీతి అంతుచూడాల్సిన న్యాయ వ్యవస్థకే అవినీతి మరకలు అంటుకున్నాయన్నది నిష్ఠుర సత్యం. 2011లో సుప్రీం కోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి జె.ఎస్ వర్మ కూడా న్యాయవ్యవస్థలో అవినీతిపై ఆందోళన వ్యక్తం చేశారు. సుప్రీం కోర్టు న్యాయవాది, సామాజిక కార్యకర్త, న్యాయవ్యవస్థ జవాబుదారీ తనానికి కృషి చేస్తున్న ప్రశాంత్ భూషణ్ సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తుల్లో సగం మంది అవినీతిపరులు అని వ్యాఖ్యానించడం అప్పట్లో సంచలనం రేపింది. దీనిపై ఆయనకు కోర్టు నోటీసులు కూడా అందాయి. దీనికి స్పం దిస్తూ 2009 డిసెంబర్‌లో ఆయన ఒక అఫిడవిట్ దాఖలు చేశారు.న్యాయశాఖ మాజీ మంత్రి శాంతి భూషణ్ కూడా ప్రశాంత్ భూషణ్ వ్యాఖ్యలను సమర్థించడం ప్రస్తుత న్యాయ వ్యవస్థ తీరును చెప్పకనే చెబుతోంది. దిగువ కోర్టుల్లో అవినీతి కొంత వరకు సాధారణమై పోయిందన్న ఆరోపణలు ఉన్నాయి. ఈ జాడ్యం అత్యున్నత న్యాయస్థానానికి సైతం చేరడం అందరినీ ఆందోళనలో ముంచెత్తుతోంది.

> దేశంలో పెరుగుతున్న జనాభాకు అనుగుణంగా జిల్లాస్థాయిలో కోర్టుల సంఖ్య పెంచాల్సిన అవసరం ఉంది. కింది స్థాయి కేసుల పరిష్కారం కోసం కేంద్ర గ్రామీణ న్యాయాలయాల చట్టాన్ని తీసుకువచ్చారు. కాని అవి పూర్తిస్థాయిలో అన్ని రాష్ట్రాలల్లో అమలుకు నోచుకోలేదు. దేశంలో 11 రాష్ట్రాల్లో 320 గ్రామీణ న్యాయాలయాలను నోటిఫై చేయగా ప్రస్తుతం 8 రాష్ట్రాలల్లో కేవలం 240 మాత్రమే ఏర్పాటై ప్రజలకు అందుబాటులో ఉన్నాయి. కాని తెలుగు రాష్ట్రాలల్లో మాత్రం ఏర్పాటు చేయలేకపోయారు. వీటిని తక్షణమే విస్తరించాల్సిన అవసరం ఉంది. కేంద్రప్రభుత్వం తగు చర్యలు తీసుకొని సుప్రీంకోర్టు నుండి జిల్లాస్థాయి కోర్టులల్లో ఉన్న న్యాయవాద ఖాళీలను భర్తీ చేయాలి. దీనివల్ల పెండింగ్ కేసుల పరిష్కారానికి మార్గం సుగమం అవుతుంది. అప్పుడే ప్రజలకు సత్వర న్యాయం అందుతుంది. న్యాయవ్యవస్థపై నమ్మకం పెరుగుతుంది.

### అవినీతి మరకలు ఎన్నో..

స్వతంత్ర భారతదేశంలో న్యాయవ్యవస్థలో అవినీతి ఉదంతాలు ఎన్నో చోటు చేసుకున్నాయి. వాటినొకసారి పరిశీలిస్తే...1949లోజస్టిస్ సిన్హాపై అభిశంసన. 1971లో మద్రాస్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి కె.వీరాస్వామి, స్థాయికి మించిన ఆస్తులు కలిగి ఉన్నారన్న ఆరోపణలపై విచారణ జరిపేందుకు సీబీఐని అనుమతించారు. 1991-1993లో సుప్రీం కోర్టు సిట్టింగ్ న్యాయమూర్తి జస్టిస్ వి.రామస్వామిపై పలు ఆరోపణలు వచ్చాయి. 1995లో బాంబే హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి ఎ.ఎం. భట్టాచార్జీ అండర్‌వరల్డ్‌తో సంబంధాలున్న ఒక ప్రచురణ సంస్థ నుంచి ఒక పుస్తకర చనపై 70 లక్షల రూపాయలు అడ్వాన్స్ తీసుకున్నట్లు ఆరోపణల నేపథ్యంలో ఆయనను రాజీ నామా చేయించారు. 1996 లో కలకత్తా హైకోర్టు న్యాయమూర్తిగా పనిచేసిన అజిత్ సేన్ గుప్తా పని చేశారు. ముంబయి అండర్‌వర ల్డ్‌తో సంబంధాలున్న స్మగ్లర్లకు చెందిన కేసుల్లో యాంటిసిపేటరీ బెయిల్ అభ్యర్థనలపై ఎక్స్‌పార్టీ ఉత్తర్వులు, మధ్యంతర స్టే ఉత్తర్వులు జారీ చేసిన అంశంలో రిటైర్ అయిన తరువాత, ఫెరా ఉల్లంఘనల కింద 1996లో ఆయనను అరెస్ట్ అయ్యారు. 2000లో భారత ప్రధాన న్యాయ మూర్తిగా పనిచేసిన ఎ.ఎస్. ఆనంద్ ఒక కేసులో తన భార్య, అత్తలకు అను కూలంగా తీర్పు ఇవ్వాలంటూ ఆయన తన హోదాను దుర్వినియోగం చేశారన్న ఆరోపణలు ఎదుర్కొన్నారు. అలాగే తనకు అనుకూలంగా ఓ కేసులో తీర్పు ఇచ్చేందుకు గాను రాజస్థాన్ హైకోర్టు డిప్యూటీ రిజిస్ట్రార్ 'లైంగిక' ప్రతిఫలం కోరినట్లు జోధ్‌పూర్‌కు చెందిన డాక్టర్ సునీత మాలవీయ ఆరోపించిన విషయం తెలిసిందే. పంజాబ్, హర్యానా హైకోర్టుకు చెందిన ముగ్గురు న్యాయమూర్తులు ఎం.ఎల్ సింగ్, మెహతాబ్ సింగ్ గిల్, అమర్‌బీర్‌సింగ్‌లు పంజాబ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరీక్షల్లో తమ కుమా ర్తెలకు, బంధువులకు అధికంగా మార్కులు వేయించుకోదలిచారన్న ఆరోపణలపై విచారణకు రెండు విచారణ సంఘాలు ఏర్పాటైన సంగతి తెలిసిందే. దీంతో గిల్, అమర్‌బీర్ సింగ్ రాజీనామా చేసినా, ఎం.ఎల్ సింగ్ మాత్రం పదవిలో కొనసాగారు. ఇలాంటి సంఘటనలే దేశంలో న్యాయ వ్యవస్థపై ప్రజల్లో సన్నగిల్లేందుకు కారణాలుగా చెప్పుకోవచ్చు.

> దేశంలో కేసుల పరిష్కారంలో జాప్యానికి న్యాయమూర్తులు, సిబ్బంది కొరత ప్రధాన కారణంగా చెప్పుకోవచ్చు. ప్రస్తుతం మన దేశంలో సుప్రీంకోర్టులో ఐదు ప్రధాన న్యాయమూర్తుల పోస్టులు ఖాళీగా ఉండగా వివిధ హైకోర్టులలో 43 శాతం న్యాయమూర్తుల పోస్టులు భర్తీ కాకుండా ఉన్నాయి. అలాగే జిల్లా కోర్టులలో 21,017 న్యాయమూర్తులకు గాను 19.82 శాతం పోస్టులు ఖాళీగా ఉన్నాయి. పదిలక్షల మంది జనా భాకు 50 మంది న్యాయమూర్తులు ఉండాలని 1987 లో లా కమీషన్ సిపార్సు చేసింది. అయితే ప్రస్తుతం దేశ జనాభా శరవేగంగా పెరుగుతున్నది. దానికి సరిపడా న్యాయమూర్తులు ఉన్నట్లు కనబడటం లేదు.

### అవినీతిని తగ్గించాలంటే...

టెక్నాలజీ వినియోగం ద్వారా దిగువ కోర్టుల్లో అవినీతిని చాలావరకు తగ్గించే వీలుంది. పై కోర్టులు దిగువ కోర్టుల పనితీరును సమీక్షిం చడం తేలికవు తుంది. సాధారణ మనిషికి అర్థమయ్యేలా న్యాయసంబంధిత వెబ్‌సైట్లు, సీడీలు అందుబాటులోకి తేవాలి. కోర్టు ఫైళ్ళను కంప్యూటరీకరించాలి. కోర్టు ప్రొసీడింగ్స్ వీడియో రికార్డులు నిర్వహించాలి. కోర్టులపై భారం తగ్గేందుకు ప్రత్యామ్నాయ విధానాలు ఆలోచించాలి. న్యాయమూర్తుల సంఖ్య పెం చాలి. ఫాస్ట్ ట్రాక్ కోర్టులు ఏర్పాటు చేయాలి.
జడ్జీలను జ్యుడీషియల్ రివ్యూ పరిధిలోకి తేవాలి. కోడ్ ఆఫ్ కండక్ట్ ఏర్పరచు కోవాలి. అవినీతికి వ్యతిరేకంగా బార్ అసోసియేషన్ కృషి చేయాలి. న్యాయవ్యవస్థపై అంతర్గత లేదా బహిర్గత నిఘా వ్యవస్థ ఏర్పరచాలి. న్యాయ మూర్తులు, వారి కుటుంబ సభ్యులు తమ ఆస్తుల వివరాలు ప్రకటించాలి.

### జన కోసం జస్టిస్..

భారత రాజ్యాంగంలోని 39వ అధికరణ నిర్దేశించిన ప్రకారం ప్రతి భారత పౌరునికి ఆర్థికంగా, సామాజికంగా, రాజకీయంగా ఉచితంగానే న్యాయసేవలు అందించాలి. అందులో భాగంగానే పార్లమెంటు యాక్ట్ ద్వారా 1987 లో లీగల్ సర్వీసెస్ అథారిటిని ఏర్పాటు చేశారు. ఉది 1995 లో నవంబర్ 9న జాతీయస్థాయిలో పేదవర్గాలకు న్యాయసేవలు ఉచితంగానే అందించేందుకు ఏర్పాటైయింది. సెక్షన్ 18 (1) యాక్ట్ ప్రకారం లోక్ ఆదాలత్‌కి వచ్చిన ఫిర్యాదుల పరిష్కారం మరియు వాది ప్రతివాదులను కాంప్రమైస్ చేసే అధికారం ఉంది. అయితే 1987 యాక్ట్ ప్రకారం లోక్ ఆదాలత్‌లో పరిష్కారం అయిన సమస్యలు అంతిమంగా ఫైనల్‌గా భావించాలి. న్యాయం జరగలేదని ఎవరైనా మళ్ళీ కోర్టు మెట్లు ఎక్కే అధికారం కోల్పోతారు. ఈ లోక్ ఆదాలత్ ఏర్పాటు అయిన దగ్గర నుంచి సెప్టెంబర్ 2015 చివరి నాటికి దేశంలో మొత్తం 15.14 లక్షల లోక్ ఆదాలత్‌లు నిర్వహించగా 8.25 కోట్ల కేసులు పరిష్కార మార్గం చూపాయి. అదేవిధంగా ఇటీవల 2017 ఫిబ్రవరి 11 న నిర్వహించిన లోక్ ఆదాలత్‌లో 9,34,180 కేసులు పరిష్కారానికి రాగా 31.58 శాతం మేర కేసులు పరిష్కారం అయ్యాయి. అదే తెలంగాణలో 67,572 కేసులు పరిష్కారానికి రాగా 32.70 శాతం పరిష్కారం అయ్యాయి. అంటే న్యాయస్థానాలల్లో నేరుగా పరిష్కారం కాని కేసులు లోక్ ఆదాలత్‌లోనే ఎక్కువ స్థాయిలో పరిష్కారం అవుతున్నాయి. అంటే న్యాయవాదులకు అధికమొత్తంలో ఫీజులు చెల్లించి ఆర్థికంగా చితికిపోవడం కంటే వాది, ప్రతివాది ఇరువురు కలిసి లోక్ ఆదాలత్‌లోనే సమస్య పరిష్కారానికి అంతిమంగా అంగీకారానికి రావడం మేలు. లోక్ ఆదాలత్‌లు అందించే సేవలు ప్రజల్లోకి తీసుకుపోవాల్సిన బాధ్యత ప్రతిపౌరునిపై ఉంది. అలాగే ప్రభుత్వాలు ప్రజలకు దీనిపై అవగాహన కల్పించాల్సిన అవసరం ఉంది.

### సత్వర న్యాయం కోసం..

దేశంలో పెరుగుతున్న జనాభాకు అనుగుణంగా జిల్లాస్థాయిలో కోర్టుల సంఖ్య పెంచాల్సిన అవసరం ఉంది. కింది స్థాయి కేసుల పరిష్కారం కోసం కేంద్ర గ్రామీణ న్యాయాలయాల చట్టాన్ని తీసుకువచ్చారు. కాని అవి పూర్తిస్థాయిలో అన్ని రాష్ట్రాలల్లో అమలుకు నోచుకోలేదు. దేశంలో 11 రాష్ట్రాల్లో 320 గ్రామీణ న్యాయాలయాలను నోటిఫై చేయగా ప్రస్తుతం 8 రాష్ట్రాలల్లో కేవలం 240 మాత్రమే ఏర్పాటై ప్రజలకు అందుబాటులో ఉన్నాయి. కాని తెలుగు రాష్ట్రాలల్లో మాత్రం ఏర్పాటు చేయలేకపోయారు. వీటిని తక్షణమే విస్తరించాల్సిన అవసరం ఉంది. కేంద్రప్రభుత్వం తగు చర్యలు తీసుకొని సుప్రీంకోర్టు నుండి జిల్లాస్థాయి కోర్టులల్లో ఉన్న న్యాయవాద ఖాళీలను భర్తీ చేయాలి. దీనివల్ల పెండింగ్ కేసుల పరిష్కారానికి మార్గం సుగమం అవుతుంది. అప్పుడే ప్రజలకు సత్వర న్యాయం అందుతుంది. న్యాయవ్యవస్థపై నమ్మకం పెరుగుతుంది.

# అలనాటి తారలు

అలనాటి అందాల తారగా శ్రీదేవి దక్షిణాది భాషలన్నింటితో పాటు బాలీవుడ్‌లో కూడా తనకంటూ ఓ విశిష్ఠమైన స్థానం సంపాదించుకున్నారు. చిన్నప్పటినుండి తనకున్న నటన పట్ల ఆసక్తితో తన నాలుగేళ్ళ ప్రాయంలోనే తెరంగ్రేటం చేసింది శ్రీదేవి. 1963లో పుట్టిన శ్రీదేవి 1967లో కందన్ కరునాల్ తమిళ్ చిత్రం ద్వారా సినిమా తెరకు పరిచయమై ఆ తరువాత 1970లో మా నాన్న నిర్దోషి చిత్రం ద్వారా తెలుగులో ప్రవేశించింది. 1978లో పదహారేళ్ళ వయసు చిత్రంతో హీరోయిన్‌గా నటించిన శ్రీదేవి ఆ తర్వాత ఎన్నో చిత్రాల్లో హీరోయిన్‌గా తనదైన ముద్ర వేశారు. తెలుగు, తమిళ్, కన్నడ, మలయాళ వంటి దక్షిణాది భాషలన్నింటితో పాటు బాలీవుడ్‌లో దాదాపు 260 పై చిలుకు చిత్రాల్లో నటించిన శ్రీదేవి వేటగాడు, చుట్టాలున్నారు జాగ్రత్త, సర్దార్ పాపారాయుడు, గజదొంగ, భోగభాగ్యాలు, ఆకలి రాజ్యం, గురు శిష్యులు, కొండవీటి సింహం, ప్రేమాభిషేకం, త్రిశూలం, బెబ్బులిపులి, జస్టిస్ చౌదరి, ముందడుగు, ఊరంతా సంక్రాంతి, వజ్రాయుధం, అఖరిపోరాటం, జగదేవకవీరుడు అతిలోకసుందరి, క్షణక్షణం, ఎస్.పి.పరశురాం వంటి చిత్రాల్లో నటించి మెప్పించి ప్రేక్షకుల హృదయాలు దోచుకున్నారు శ్రీదేవి. అప్పటి తరం ఎన్‌టిఆర్, ఏఎన్నార్, కృష్ణ, శోభన్‌బాబు, కృష్ణంరాజు, చంద్రమోహన్ వంటి అగ్ర నటులతో పాటు నిన్నటి తరం చిరంజీవి, నాగార్జున, వెంకటేష్‌లతో నటించి హీరోయిన్‌గా ప్రేక్షకుల్లో చెరగని ముద్ర వేసుకున్నారు.





అందంతోనే కాక తన మెరుపులాంటి కళ్ళతో ఎదుటివాళ్ళను మెస్మరైజ్ చేయగల అలనాటి అందాల తారల్లో జయప్రద ఒకరు. కేవలం తన అందంతోనే కాకుండా అభినయంతో కూడా ప్రేక్షకుల హృదయాల్లో తనకంటూ ఓ సుస్థిరస్థానం సంపాదించుకున్నారు జయప్రద. నటనపట్ల చిన్నప్పటి నుండి తనకున్న ఆసక్తితో చిన్నతనంలోనే డాన్స్, సంగీతంలో ప్రావీణ్యం సంపాదించారు. జయప్రద అసలు పేరు లలితా రాణి. నాన్న కృష్ణారావు. తెలుగు ఫిలిం ఫైనాన్సియర్, అమ్మ నీలవేణి గృహిణి. సినిమాల పట్ల ఆసక్తితో 1974లో భూమికోసం చిత్రంతో తెరంగ్రేటం చేసిన జయప్రద తెలుగు, తమిళ, కన్నడ, మలయాళం, బెంగాలీ, మరాఠి చిత్రాలతో పాటు హిందీలోనూ దాదాపు 95 చిత్రాల్లో నటించి మెప్పించి  హీరోయిన్‌గా తనదైన ముద్ర వేసుకున్నారు జయప్రద. అంతులేనికథ, అడవిరాముడు, కురుక్షేత్రం, చాణక్య చంద్రగుప్త, యమగోల, సిరిసిరిమువ్వ, సాగరసంగమం, మేఘసందేశం, మహాసంగ్రామం, సింహాసనంచ, మహారథి వంటి చిత్రాలు ఆమె నటనకు తార్కాణంగా నిలుస్తాయి. ఎన్టీఆర్, ఏఎన్నార్, కృష్ణ, కృష్ణంరాజు, శోభన్‌బాబు, చిరంజీవి, కమల్‌హాసన్, రజనీకాంత్ వంటి అలనాటి అగ్ర హీరోలందరితో నటించి తన సత్తాను చాటుకున్నారు. యాక్టర్‌గానే కాకుండా పొలిటీషియన్‌గా కూడా తన ప్రత్యేకతను చాటుకుంటూ ప్రేక్షకుల్లో విశిష్ఠమైన స్థానం సంపాదించుకున్నారు జయప్రద.

## కథ

కౌశిక్ చాలా ఉత్సాహంగా ఉన్నాడు. రాత్రంతా నిద్దుర లేకున్నా ఆ ఛాయలు ఎక్కడా కనిపించడం లేదు. అతనిలో ఏదో కొత్త ఉత్సాహం కనిపిస్తోంది. ఇప్పటికి పదిసార్లు అద్దం ముందు నిల్చున్నాడు. దువ్విన తలనే దువ్వుతున్నాడు. హెయిర్ స్టైల్ మార్చి మార్చి చూసుకుంటున్నాడు. వాచీ వంక పదే పదే చూసుకుంటున్నాడు. ఇప్పటికి అతని హడావిడి వయస్సు మూడు గంటలు. ఇదంతా చూస్తున్న రూమ్ మేట్స్‌కు చిర్రెత్తింది. ఓరేయ్ ఏమైందిరా నీకు? ఎందుకు ఆ హడావిడి. ఏదైనా ఉద్యోగం వచ్చిందా? పోనీ ఇంటర్వ్యూకు వెళ్తున్నావా? లేక ఏదైనా ఫ్యాషన్ షోలో పాల్గొనాలా? అంటూ నిలదీశారు. కౌశిక్ ముసి ముసి నవ్వులు నవ్వుతున్నాడే తప్ప. నో రిప్లై. నీ యంకమ్మ..చెప్తువా లేదా. అంటూ ఓ మిత్రుడు చేతిలో పుస్తకాన్ని విసిరాడు. అది గమనించిన కౌశిక్ పుస్తకాన్ని ఒడుపుగా పట్టుకుని వేలి మీద గిరగిరా తిప్పాడు. అది చూసిన

# ఫేస్ బుక్కైన ప్రేమ



మిత్రులకు మతి పోయింది. కౌశిక్‌ను చూసి జుట్టు పీక్కున్నారు. ఇంతలో పనిమీద బయటకు ఇచ్చిన కౌశిక్ జిగిరి దోస్త్ అప్పుడే రూమ్‌లోకి ఎంటర్యయాడు. అతన్ని చూసిన మిత్రులకు ప్రాణం లేచొచ్చి నట్లైంది. ఓరే విక్కీగా వీడికేమైందిరా? ఉదయం నుంచి వాడి ఓవర్ యాక్షన్ చూడలేక చస్తున్నాం. అంటూ అడిగారు. అది విన్న విక్కీ పకపకా నవ్వి..మీకు తెలీదు కదూ ఈ రోజు వాడి ఫేస్ బుక్ గాళ్ ఫ్రెండ్ వస్తుందిరా బెంగుళూరు నుంచి. కేవలం వీడిని కలవడం కోసమే. అంటూ కౌశిక్ అవధులు లేని ఆనందానికి కారణం చెప్పేసాడు. ఓర్నీ వేశాలు. దీనికోసం ఇంత హంగామా.అంటూ అందరు లేచి వెళ్లి, వంగబెట్టి దబీ దిబీ బాదేశారు. అప్పుడు కౌశిక్ పూర్తిగా ఈ లోకంలోకి వచ్చాడు. సారీరా ..చెప్పాలనుకున్నా చెప్పలేదు. సంవత్సరకాలంగా ముఖపుస్తకంలో పరిచయమైన సుందరికి నాకు మధ్య ప్రేమ చిగురించి, పెరిగి పెద్దదై పూలు పూసింది. ప్రేమపూల పరిమళాన్ని ఆస్వాదించేందుకు నా సుందరి నాకోసం ఈ రోజు ఇక్కడికి వస్తుంది. ఇద్దరం కలిసి మాట్లాడుకున్నాక..మా ప్రేమ విషయం పెద్దలతో చెప్పి, పెళ్లి చేసుకుంటా అన్నాడు కౌశిక్. అని వాచ్ చూసుకున్నాడు. అమ్మో టైం పదైంది. 1 గంటకు ఎంజీబీఎస్‌కు వస్తుంది. వెళ్లాలి అంటూ మిత్రులకు చెప్పి, హడావిడిగా రోడ్డున పడ్డాడు.

టైం..పదింపావు..

కౌశిక్ కేపీహెచ్‌బీ బస్ స్టాప్‌లో నిల్చున్నాడు.

టైం పదిన్నర..ఇంకా సీబీఎస్‌కు వెళ్లే బస్ రాలేదు. ..

బస్సులు ఎందుకో చాలా తక్కువగా ఉన్నాయి..

కౌశిక్‌లో టెన్షన్ పెరిగిపోతుంది....

పాకెట్ లోంచి పర్స్ తీసి చూసుకున్నాడు....

వెయ్యిరూపాయలు ఉన్నాయి....

ఏటీ ఎం కార్డు ఉంది....

హమ్మయ్య అనుకుని ఆటోను పిలిచి సీబీఎస్‌కు పదా అన్నాడు. ఆటో కదిలింది. ఆటోతో పాటు కౌశిక్ బుర్రలో సుందరికి తనకు పరిచయం, మాటలు కలవడం, ప్రేమ చిగురించిందం తిరుగుతున్నాయి. ఆటో కంటే వేగంగా..

కౌశిక్ మాదాపూర్‌లోని ఓ ఐటీ కంపెనీలో సాఫ్ట్ వేర్ ఇంజనీర్....

నెలకు 70 వేల రూపాయల జీతం.....

కుటుంబం మాత్రం హైదరాబాద్‌కు దగ్గర్లోని పల్లెటూర్లో నివాసం ఉంటున్నారు. పది వరకు ఊర్లో చదివిన కౌశిక్ ఇంటర్ నుంచి ఇప్పటి వరకు హైదరాబాద్‌తోనే అనుబంధమంతా. మంచి చలాకి కుర్రాడు. జీతంలో సగం ఇంటికి పంపి, మిగతా సగం తను ఖర్చు చేసుకుంటారు.

వాళ్ల అమ్మ మాత్రం చిన్నా నీకు సరిపోతాయా? ...

మాకు పంపడం దేనికిరా అంటుంది..ప్రేమగా.. కాని అతినికి అదో తృప్తి.

చాలకుంటే అడిగి తీసుకుంటాగా అంటూ కౌశిక్ సమాధానం ఇస్తాడు.

ప్రతి నెలా మొదటివారం కౌశిక్ ఊరెళ్లడం. అమ్మకు మనీ ఇవ్వడం..ఆమె అలా అనడం..కౌశిక్ ఇలా సమాధానం ఇవ్వడం మామూలైపోయి. అతని మాటలు వింటే తల్లి దండ్రులకు ఎక్కడ లేని ఆనందం. అలా సంవత్సర కాలంగా వీకెండ్ పార్టీలు, మిత్రులతో సినిమాలు షికార్లతో కులాసాగా సాగిన కౌశిక్ జీవితంలోకి ప్రవేశించింది సుందరి..ఫేస్ బుక్ ద్వారా.

ఆ రోజు కౌశిక్‌కు రాత్రి డ్యూటీ.సమయం ఒంటి గంట...

పని పూర్తి చేశాక, కౌశిక్ టైం పాస్ కోసం ముఖ పుస్తకం తెరిచాడు.....

నోటిఫికేషన్స్ ఆన్‌చేస్తే ఓ ఫ్రెండ్ రిక్వెస్ట్ ఉంది....

అందులో ఓ ఆడపడుచు పంపంది.....

అది చూడగానే కౌశిక్‌లో ఏదో తెలియని ఫీలింగ్..

వెంటనే రిక్వెస్ట్ పెట్టిన సుందరి ప్రొఫైల్ ఓపెన్ చేసి చూసాడు. చూడగానే ఆకట్టుకుంది సుందరి. ఐశ్వర్యా రాయ్ అంత అందగత్తె కాకున్నా.. మొత్తానికి ఆకర్షించే అందం. ప్రొఫైల్ మొత్తం తిరిగేశాడు.సుందరిది బెంగుళూరు. బాగా రిచ్ అన్న సంగతి అర్థమైంది. తన వయస్సే ఉంటదనిపించింది పిక్ చూస్తే. ఇక వెంటనే రిక్వెస్ట్ ఓకే చేశాడు. తనకు ఓ రిచ్ అమ్మాయి రిక్వెస్ట్ పంపిందన్న ఆనందంతో.. తనను తాను ఓ సారి ఎగా దిగా చూసుకున్నాడు. తాను అందగాడే అనుకున్నాడు. అతను అనుకోవడమే కాదు. కౌశిక్‌ది హ్యాండ్ సమ్ పర్సనాలిటి. ఓ సారి మరిచి పోలేని ముఖవర్చస్సు. తనకు తెలియకుండానే టైం గడిచి పోయింది. ఉదయం ఆరుగంటలైంది. టైం కావడంతో మెల్లగా రూంకు బయలు దేరాడు. ఆ రోజు నుంచి కౌశిక్ లైఫ్ స్టైల్లో మార్పు వచ్చింది. ప్రతినెలా ఓ కొత్త డ్రెస్ కొనడం సెల్ఫీ దిగడం..ఫేస్ బుక్‌లో పెట్టడం ప్రారంభించాడు. సుందరి నుంచి కూడా తాను పెట్టే ఫోటోలకు కామెంట్స్ మొదలయ్యాయి. అది గమనిస్తున్న కౌశిక్‌లో ఆమెతో చాట్ చేయాలన్న కోర్కె రోజు రోజుకు పెరిగిపోతోంది. అతి కష్టం మీద వారం రోజులు ఓపిక పట్టాడు. ఇక ఆగలేక పోయాడు. మళ్లీ కౌశిక్‌కు రాత్రి డ్యూటీలు ప్రారంభమయ్యాయి. మళ్లీ ఓ రోజు రాత్రి ముఖ పుస్తకం ఓపెన్ చేశాడు. సుందరి లైన్‌లోనే ఉంది. ఇదే అదనుగా చాట్ బాక్స్‌లోకి వెళ్లాడు.

'హాయ్ మేడమ్ గారు బాగున్నారా' ? అని పలకరించాడు

'హా..బాగున్నానండి' అంటూ రిప్లై

సుందరి రిప్లైతో కౌశిక్‌కు గుర్రాన్నెక్కినంత హుషారొచ్చింది.

'ఏంటి మేడమ్ ఇంత రాత్రి వరకు మెలకువతో ఉన్నారని మాటలు కొనసాగించాడు

'నిద్ర రావట్లేదండి..టైం పాస్ కోసం ఇలా ..' అంటూ అక్కడి నుంచి సమాధానం

'మీరేం చేస్తుంటారు.అదే నండి జాబ్ ఏంటని' అని అడిగాడు కౌశిక్

'జాబ్ లేదండి..మాకే ఫ్యాక్టరీలు ఉన్నాయి. వాటిని చూసుకోవడానికే టైం చాలదు..

అని సుందరి సమాధానం.

'నేను సాఫ్ట్ వేర్ ఉద్యోగినండి..మాది హైదరాబాద్..మరి మీది' అని అడిగాడు

'ప్రొఫైల్ చూశారుగా చూడలేదా' అని ఎదురు ప్రశ్న వేసింది.

'బెంగుళూరే కదా .చూసా...అడిగాలని అడిగాను అంతే

' అని కౌశిక్ రిప్లై...

ఇలా మాట మాట కలిశాయి. అక్కడి నుంచి ప్రతిరోజు రాత్రిపూట ఇద్దరి మధ్య చాటింగ్ సాగుతోంది.

అలా సాగిన చాటింగ్, కౌశిక్ మదిలో ప్రేమ చిగురించే వరకు వచ్చింది. మాటలు కలిసాయి. మాటల్లో మనసులు కలిశాయి అనుకున్నాడు కౌశిక్. ఇలా

ఆరు మాసాలు ఫేస్ బుక్ చాటింగ్ రామాయణం..సాగింది.. ఇక లాభం ... మనస్సులో మాటా చెప్పాలనుకున్నాడు కౌశిక్.. ఓ రోజు మంచి పిక్ చూసి, ఇన్‌బాక్స్‌లో ఐ లవ్ యూ అంటూ చెప్పేసాడు. నాకు అభ్యంతరంలేదని చెప్పింది సుందరి. ఆఫీస్‌లో అందరు ఉన్నారన్న స్పృహకూడా లేకుండా యాహూ అనేశాడు. కొల్లీగ్స్ అంతా ఏమైందంటూ అడిగాక తాను చేసిన పనికి సిగ్గుపడి. అందరికి సారీ చెప్పేసాడు.

తన ప్రేమను సుందరి అంత తేలిగ్గా ఓకే చేస్తుందనుకోలేదు. అంత ధనవంతురాలు తనను ఇష్టపడం అనేది కలల అనిపించినా అది నిజం అని తెలుసు కాబట్టి ఉబ్బితబ్బిబ్బయ్యాడు. మరో ఆరు మాసాలు గడిచిపోయాయి . ఓ రోజు రాత్రి చాటింగ్ బాక్స్‌లో చూడాలని ఉంది వస్తా అన్నాడు. వద్దు నాకే కంపెనీ పని ఉంది నేనే హైదరాబాద్ వస్తానని చెప్పింది. ఇంకేముంది మన హీరో ఆనందానికి పట్ట పగ్గాలులేవు..

సార్ సీబీఎస్ వచ్చింది...... అంటూ ఆటోవాడు పిలిచే వరకు కౌశిక్ గతంలో విహరించాడు. ఆటోవాలా పిలుపుతో లేచి, మనీ ఇచ్చి, రోడ్డు దాటి ఎంజీబీఎస్ లోకి వెళ్లాడు.

సార్ సీబీఎస్ వచ్చింది...... అంటూ ఆటోవాడు పిలిచే వరకు కౌశిక్ గతంలో విహరించాడు. ఆటోవాలా పిలుపుతో లేచి, మనీ ఇచ్చి, రోడ్డు దాటి ఎంజీబీఎస్ లోకి వెళ్లాడు. టైం చూసుకుంటే ఇంకా ఒంటిగంటే.. మరో గంట వెయిట్ చేయాలా అంటూ నిట్టూర్చాడు.తప్పదు. అంటూ బెంగుళూరు బస్ స్టాప్ దగ్గరకు చేరుకున్నాడు.

ఇక్కడ ఇతని పరిస్థితి ఇలా ఉండే..బెంగుళూరు నుంచి బస్సులో వస్తున్న సుందరిది మరో విచిత్ర పరిస్థితి. కౌశిక్ తన వయస్సే ఉంటుందా?..లేక నాకంటే పెద్దోడా?..చిన్నోడా? ఇలా ఆలోచిస్తుంది. ఎందుకంటే ఫేస్ బుక్‌లో నూటికి సగం మంది పెట్టే ఫోటోలు, చెప్పే వయస్సుకు సంబంధం ఉండదు. కౌశిక్ కూడా అలానే అనుకుంది. అంతా ట్రాష్. అందుకే సుందరి మనస్సు అలా పరిపరివిధాలుగా ఆలోచిస్తుంది. ఇంతలోనే ఎంజీబీఎస్ వచ్చింది. బస్సుదిగగానే ఎదురుగా కౌశిక్‌ను చూసి షాక్ తింది. కౌశిక్‌ది నిజంగా మంచి పర్సనాలిటి. వయస్సు 25 కంటే ఎక్కువ ఉండవు. అతన్ని చూసి తానే సిగ్గుపడింది.తప్పు చేసాననుకుంది. అయినా అతనితో మాట్లాడాలనుకుంది.. మెల్లగా అతిని దగ్గరకు వెళ్లి..మాదాపూర్ వెళ్లాలంటే ఇక్కడి నుంచి బస్సులు ఉంటాయా అని అడిగింది. అతను ఉంటాయని ఫలానా నెంబర్ బస్ ఎక్కమని చెప్పాడు.ఎలా వెళ్లలో చెప్పాడు ఆమె వెళ్లాల్సిన అడ్రస్ కనుక్కొని మరీ. అప్పుడు అనిపించింది కౌశిక్‌ది చాలా సిన్సియర్ లవ్ అని. మరో సారి అతన్ని తనివి తీరా చూసుకొంది. బస్‌లో ఉండగానే తాను బుక్ చేసిన క్యాబ్ వాడు ఫోన్ చేయడంతో మెల్లగా అక్కడి నుంచి కదలింది. క్యాబ్ ఎక్కి సీట్లో వెనక్కువాలింది. సుందరి కళ్లల్లో నీళ్లు సుళ్లు తిరుగుతున్నాయి. తాను పెద్ద తప్పు చేశాన్న పశ్చాత్తాపంతో కన్నీళ్లు దారలా ఉబికి వస్తున్నాయి. ఎందుకంటే సుందరి వయస్సు 50 సంవత్సరాలు. ఇద్దరు పిల్లలు.ఒక అబ్బాయి.ఒక అమ్మాయి. భర్త కాలం చేసి రెండు సంవత్సరాలైంది. పిల్లలిద్దరికి పెళ్లిళ్లు అయ్యాయి. ఇద్దరు అమెరికాలో స్థిరపడ్డారు. దాంతో బెంగుళూరులోని లంకంత కొంపలో ఒంటరిగా ఉంటోంది. కంపెనీ పనులు తన మేనల్లుడు చూసుకుంటాడు. దాంతో టైం పాస్ కోసం ముఖపుస్తకంలో అకౌంట్ ఓపెన్ చేసింది. ఇంత వయస్సున్నా, తన 20 సంవత్సరాలప్పుడు ఫోటోను ఎఫ్బీలో ప్రొఫైల్ పిక్‌గా పెట్టింది. అయితే కౌశిక్‌కు తనకు ఎప్పుడు వయస్సు ప్రస్తావన రాలేదు. తనలాగే కౌశిక్‌కూడా ప్రొఫైల్ పిక్ పెట్టి ఉంటాడు అనుకుంది. ఎందుకంటే ఫేస్‌బుక్‌లో దాదాపు సంగం మంది అలానే ఉన్నారు. తనూ అలానే అనుకుంది.

కాని వచ్చి చూసాక, తెలిసింది కౌశిక్‌ది నిజమైన ప్రేమ, నిజమైన పిక్, అతను చెప్పిందంతా నిజం.తానే ఓ అబద్ధం అనుకుంది. కౌశిక్ జీవితంలో తనో అబద్ధంలానే మిగిలి పోవాలి అని గట్టిగా నిర్ణయించుకుంది. అందుకే అతని వద్దకు వెళ్లి చూసుకుంది. కాని అతను తనను గుర్తు పట్టలేదంటే తన ఫోటోకు, ప్రస్తుతం తనకు ఎంత తేడా ఉందో అర్థం చేసుకుంది. మనస్సులోనే కౌశిక్‌కు సారీ చెప్పింది. వెంటనే సెల్ ఓపెన్ చేసి, కౌశిక్‌ను బ్లాక్ చేసింది. మనస్సాపులేదు. వెంటనే అకౌంట్‌ను డియాక్టివేట్ చేసింది. జీవితంలో ఫేస్‌బుక్ ఓపెన్ చేయకూడదనుకుంది. ఇంతలో తన చేరాల్సిన గమ్యం రావడంతో ట్యాక్సీవాడికి మనీ ఇచ్చి కారు దిగి తాను చేరాల్సిన గమ్యం వైపు మెల్లగా అడుగులు వేసింది.

అప్పుడు టైం రెండయింది. ఎంజీబీఎస్‌లో సుందరి కోసం వెయిట్ చేస్తున్న కౌశిక్‌లో టెన్షన్ మొదలైంది. బెంగుళూరు బస్సువచ్చింది. కాని సుందరి రాలేదు. దాంతో కౌశిక్ మనస్సు పరిపరివాధాలుగా పోతోంది. తాను చెప్పిన బస్స్ మిస్ అయితే వేరే బస్‌లో వస్తుందేమో అనుకున్నాడు. మరో గంట వెయిట్ చేశాడు.ఇందాకటి నుంచి కాల్ చేస్తే సెల్‌ఫోన్ స్విచ్ ఆఫ్ అనివస్తుంది. జర్నీలో కదా చార్జ్ అయిపోయి ఉంటుందనుకున్నాడు. తాను చెప్పిన బస్ నెంబర్‌ను మరో సారి చూద్దామని ఫేస్‌బుక్ ఆన్ చేశాడు. సుందరి కౌంట్ డియాక్టివేట్ చేసి ఉంది. కాల్ చేశాడు. సెల్ స్విచ్ఛాఫ్ చేసి ఉంది. సో ..సుందరి రావట్లేదనుకున్నాడు. సుందరి చాలా అందంగా తను మోసం చేసిందా అన్న అనుమానం వచ్చింది. కాని సుందరి అలాంటిది కాదని మనస్సు చెబుతోంది. మరి ఎందుకు రాలేదు? సుందరికి ఏమైంది? ఏదయినా ఆపద ముంచుకొచ్చిందా? ఉదయం బయలు దేరే ముందు మట్లాడింది. సో సుందరికి ఏదో అయింది అను కున్నాడు. ఈ ఆలోచనలతో కౌశిక్‌కు పిచ్చెక్కినట్లుంది,. రూంకు వెళ్లి ఫ్రెండ్స్‌కు ఏమి చెప్పాలో పాలు పోవడం లేదు. సుందరిని చూడకుండా బతకలేనేనే ఆలోచన ..ఊపిరి ఆడనివ్వడం లేదు. అప్పుడు గుర్తుకు వచ్చింది.. సుందరి చెప్పిన వాళ్ల ప్యాక్టరీ అడ్రస్. బెంగుళూరు వెళ్లాలని నిర్ణయించుకున్నాడు. మెల్లగా టికెట్‌బుక్ చేసుకునేందుకు కౌంటర్ వద్దకు కదిలాడు..

–చారుశ్రీ



ఈ ప్రపంచం కఠినాతి కఠినమైంది. ఈ వాస్తవాన్ని ఎదుర్కోవడంలోనే సంతోష రహస్యం ఇమిడి వుంది. -బెర్ట్రండ్ రస్సెల్

# సూర్య బుడత




## దారిని చూపండి





## తేడాలు గుర్తించండి



## చుక్కలు కలపండి

పిల్లలూ ఈ అంకెలను కలపండి చూద్దాం



Name:______________ Date:__________

tea 

pony 

duck 

snake 

grape 

robot 

| | | | | | |
|---|---|---|---|---|---|
| p | r | a | e | t | e |
| o | o | q | h | e | e |
| n | b | q | k | p | k |
| y | o | q | c | a | a |
| v | t | t | u | r | n |
| k | t | q | d | g | s |

1 

2 






ఇతరులు మనల్ని ఎలా గౌరవించాలని కోరుకుంటామో, ఇతరుల్ని మనం అలాగే గౌరవించాలి - షేక్స్పియర్

వాత్సాయన

# గర్భధారణ లేకుండా చనుబాలివ్వడం: ఎలా సాధ్యమవుతుంది?



గర్భధారణ సమయంలో మరియు ప్రసవ సమయంలో లాక్టేట్ సహజంగా ఉంటుంది. కానీ గర్భధారణే లేకుండా లాక్టేట్కు అవకాశం ఉందా? హార్మోన్స్ ఆక్టివ్ గా వున్నప్పుడు మమ్మరీ గ్లాండ్స్ పాలను ఉత్పత్తి చేస్తాయి. అది న్యూ బోర్న్ బేబీ లో కలుస్తుంది. అయితే ఒకవేళ ప్రగెన్సీ కాకుండా చను పాలు వస్తే ఎం జరుగుతుంది? ఇక్కడ దాని గురించి కొన్ని వాస్తవాలు ఉన్నాయి. బ్రెస్ట్ మిల్క్ ను పెంచే పవర్ ఫుల్ ఫుడ్స్... ఫ్యాక్ట్ 1 జ్ఞాపకశక్తిని పెంచి, మతిమరువు తగ్గించే ఆహారాలు! జ్ఞాపకశక్తిని పెంచి, మతిమరువు తగ్గించే ఆహారాలు! కొద్దిసమయంలో మీ గ్యాస్ ను కడువునొప్పిని తగ్గించే దివ్య ఔషధం ! కొద్దిసమయంలో మీ గ్యాస్ ను కడువునొప్పిని తగ్గించే దివ్య ఔషధం ! మీరు ఉల్లిపాయ హల్వా గురించి విన్నారా? ఇక్కడ భారతీయులు తినే కొన్ని వింత వంటకాలను చూడండి! మీరు ఉల్లిపాయ హల్వా గురించి విన్నారా? ఇక్కడ భారతీయులు తినే కొన్ని వింత వంటకాలను చూడండి! ఫ్యాక్ట్ 1 గాలక్టోరియా అని పిలిచే ఒక పరిస్థితి చనుబాలు రావడానికి కారణమవుతుంది. మహిళల లో చాల కొద్ది శాతం మంచి ఈ పరిస్థితికి ఏడ్పడుతుంది. ఫాక్ట్ 2 ఫాక్ట్ 2 గెలాక్టరియా అనేది పురుషుల మీద కూడా ప్రభావితం చేస్తుంది. అధిక పాల వుత్పతే దీని ప్రధాన లక్షణం. కొన్ని సందర్భాల్లో, పాలు ఉరుగుజ్జులు నుండి రావడం మొదలవుతుంది. ఫాక్ట్ 3 ఫాక్ట్ 3 గాలక్టోరియా యొక్క ఇతర లక్షణాలు తలనొప్పి, మటిమలు, విస్తరించిన రొమ్ము కణజాలం, రెగ్యులర్ గా పీరియడ్స్ రాకపోవడం, వికారం మరియు తక్కువ లిబిడో ఉంటుంది. ఫాక్ట్ 4 ఫాక్ట్ 4 గెలాక్టరియా కి హార్మోన్ల సమస్యల వలన కలిగే దుష్ప్రభావాలు, కొన్ని ఆరోగ్య పరిస్థితులు, కణితులు మరియు ఎక్కువ ఉద్దీపనలు కూడా కారణం కావచ్చు. ఫాక్ట్ 5 జ్ఞాపకశక్తిని పెంచి, మతిమరువు తగ్గించే ఆహారాలు! జ్ఞాపకశక్తిని పెంచి, మతిమరువు తగ్గించే ఆహారాలు! కొద్దిసమయంలో మీ గ్యాస్ ను కడువునొప్పిని తగ్గించే దివ్య ఔషధం ! కొద్దిసమయంలో మీ గ్యాస్ ను కడువునొప్పిని తగ్గించే దివ్య ఔషధం ! మీరు ఉల్లిపాయ హల్వా గురించి విన్నారా? ఇక్కడ భారతీయులు తినే కొన్ని వింత వంటకాలను చూడండి! మీరు ఉల్లిపాయ హల్వా గురించి విన్నారా? ఇక్కడ భారతీయులు తినే కొన్ని వింత వంటకాలను చూడండి! ఫాక్ట్ 5 గెలాక్టరియాకు కారణమయ్యే వెద్య పరిస్థితులు అధిక ఈస్ట్రోజెన్ స్థాయిలు, రొమ్ము కణజాలం, ఒత్తిడి, కాలేయం లేదా మూత్రపిండాల సమస్యలు మరియు థెరాయిడ్ సమస్యల వంటివి. కొకెన్, మాదకద్రవ్యాలు మరియు గంజాయి వంటి కొన్ని మందులు కూడా చనుబాలు రావడానికి కారణమవుతాయి. ఒక వెద్యుడు మాత్రమే ఈ సమస్యను విశ్లేషించవచ్చు మరియు చికిత్సను చేయగలడు. ఫ్యాక్ట్ 6 ఫ్యాక్ట్ 6 ఇక్కడ ఒక మహిళ గర్భవతి కాకుండా లాక్టేట్ కోరుకోవడానికి ఇంకొక అవకాశం వుంది. ఒక శిశువును స్వీకరించినవుడు మరియు తల్లిపాలను ఇవ్వాల్సి వచ్చినప్పుడు, వారు గర్భవతి కాకుండా వారి ఇష్టప్రకారం అలాంటి ఒక ఎంపికను చేసుకుపోవచ్చు. నడక నేర్చిన పిల్లలను చనుబాలు తాగడం మాన్పించడం ఎలా ? వాస్తవం 7 జ్ఞాపకశక్తిని పెంచి, మతిమరువు తగ్గించే ఆహారాలు! జ్ఞాపకశక్తిని పెంచి, మతిమరువు తగ్గించే ఆహారాలు! కొద్దిసమయంలో మీ గ్యాస్ ను కడువునొప్పిని తగ్గించే దివ్య ఔషధం ! కొద్దిసమయంలో మీ గ్యాస్ ను కడువునొప్పిని తగ్గించే దివ్య ఔషధం ! మీరు ఉల్లిపాయ హల్వా గురించి విన్నారా? ఇక్కడ భారతీయులు తినే కొన్ని వింత వంటకాలను చూడండి! మీరు ఉల్లిపాయ హల్వా గురించి విన్నారా? ఇక్కడ భారతీయులు తినే కొన్ని వింత వంటకాలను చూడండి! వాస్తవం 7 హార్మోన్ చికిత్స మరియు ఉరుగుజ్జుల ప్రేరణ చనుబాలను ప్రేరేపించడానికి కొన్ని మార్గాలు. గర్భధారణ లేకుండా లాక్టేట్ చేయాలనుకునే మహిళలు సాధారణంగా హార్మోన్ చికిత్సను ఎంపిక చేసుకుంటారు. తల్లి పాలివ్వడం మానేసిన తర్వాత వారు ఈ చికిత్సను నిలిపివేయవచ్చు. కొన్ని సందర్భాల్లో, ఒక శిశువెద్యుని పర్యవేక్షణలో కూడా తల్లిపాలను పంవుతారు. ఫాక్ట్ 8 ఫాక్ట్ 8 గర్భం లేకుండా లాక్టేట్ చేయాలనుకునే వారు కూడా కొన్ని దుష్ప్రభావాలను పరిగణనలోకి తీసుకోవాలి. ఈ సందర్భంలో రొమ్ములు సున్నితంగా, బాధాకరమెన మరియు లేతగా మారవచ్చు. వాటి కూడా పరిమాణం కూడా పెరగవచ్చు మరియు కొంత అసౌకర్యం కలిగించవచ్చు. కొందరు మహిళలు రొమ్ము సంక్రమణ, వుండ్లు, ఇతర దుష్ప్రభావాలు కూడా కృాఎత్రిమంగా చనుబాలివ్వడం వల్ల ప్రేరేపించబడవచ్చు. కాబట్టి, అటువంటి ఎంపికలను ఎంచుకునే ముందు అన్ని అంశాలను పరిగణనలోకి తీసుకోవడం మరియు డాక్టర్ తో ప్రతిదీ చర్చించడం మంచిది.



## క్రైం స్టోరీ

# మైనర్ కామ పిశాచి

**తల్లిదండ్రుల పెంపకం లోపమో, సినిమాలు, పరిస్థితుల ప్రభావమో.. మనిషిలో మానవత్వం మంటకలుస్తోంది. భూతదయ మాట అటుంచితే, సాటి మనిషి పట్ల సాను భూతి కూడా కరువవుతోంది. మైనర్లు సైతం లైంగిక దాడులకు తెగబడుతున్నారు. తాము చేసిన పాపం బయట పడకుండా ఉండేందుకు హత్యలు చేస్తున్నారు. ఓ మైనర్ కామ పిశాచి, తన దాహం తీర్చుకునేందుకు, అసహజ రీతిలో మరో మైనర్ పై అత్యాచారం చేయడమే కాకుండా హత్య చేసిన ఘటన హైదరాబాద్ నగరంలో సంచలనం సృష్టిస్తోంది. సభ్యసమాజం సిగ్గుతో తలదించుకునేలా చేసింది. వివరాల్లోకి వెళితే.....**

అతని వయస్సు 17 సంవత్సరాలు. ఇప్పటి వరకు దాదాపు 15 మందిపై లైంగిక దాడికి పాల్పడ్డాడు. బయటకు పొక్కకుండా జాగ్రత్త పడ్డాడు. అయితే ఇటీవల పదేళ్ల బాలుడిపై అసజ లైంగిక దాడికి పాల్పడి, గుట్టు రట్టవుతుందనే భయంతో ఆ పసిమొగ్గను చిదిమేశాడు. చట్టం చేతులు పొడవు కదా. సీసీ కెమెరాల్లో దొరికిన చిన్న క్లూ ఆధారంగా ఆ కామపిశాచిని పోలీసులు అరెస్ట్ చేశారు. వివరాల్లోకి వెళితే ..

బార్కాస్ ప్రాంతానికి చెందిన ఆటోడ్రైవర్ మహ్మద్ జమీల్ ఖాన్ కుమారుడు మహ్మద్ ఖాన్, స్థానిక లయోలా పాఠ శాలలో నాలుగో తరగతి చదువుతున్నాడు. రంజాన్ సందర్భంగా బార్కాస్ బజార్‌లో ఏర్పాటైన మేళా దగ్గర జూన్ 28న ఈ చిన్నారి ఆడుకుంటున్నాడు. బడీ మసీదు వద్ద ఆడుకుంటున్న ఖాన్‌కు బిస్కెట్లు, చాక్లెట్లు ఆశ చూపిన మైనర్‌కామ పిశాచి, బాలున్ని బార్కాస్ ప్రభుత్వ పాఠశాల వద్దకు తీసుకువెళ్లాడు. సాయంత్రం 6 గంటల సమయంలో పాఠశాల గ్రిల్స్ తొలిగించి భవనంపైకి చేరుకుని, అక్కడే చిన్నారిపై అసహజ లైంగిక దాడికి పాల్పడ్డాడు. బాలుడు తనకు నొప్పిగా ఉందని, విషయం తండ్రికి చెవుతా ననటంతో అతను తీవ్రంగా భయపడ్డాడు. జూలై 2న తన సోదరి వివాహం ఉండటంతో విషయం బయటకు వస్తే పెళ్లి ఆగిపోయే ప్రమాదం ఉందని భావించాడు. అఘాయిత్యం వెలుగులోకి రాకూడదంటే బాలుడిని హత్య చేయడమే మార్గ మని భావించాడు. అక్కడే ఉన్న రాడ్లు, కర్రలతో బాలుడిపై కిరాతకంగా దాడి చేసి హతమార్చాడు. మృత దేహాన్ని మా యం చేసే ఉద్దేశంతో కాళ్లు, చేతులు కట్టేశాడు. బాలుని శవాన్ని మరో చోటికి మార్చడానికి రెండుసార్లు ప్రయత్నించినా లాభం లేకపోవడంతో మిన్నకుండిపోయాడు. ఉదంతం జరిగింది మూడో అంతస్తుపైన కావడం, పాడు బడినట్లు ఉండే అక్కడికి ఎవరూ వెళ్లకపోవడంతో విషయం వెలుగులోకి రా లేదు. ఇదిలా ఉండగా ఆడుకోవడానికి వెళ్లిన ఖాన్ తిరిగి ఇంటికి రాకపోవడంతో కుటుంభ సభ్యులు తీవ్ర ఆందోళనకు గుర య్యాడు. తెలిసి చోట వాకబు చేశారు. అం ు న



ఖాన్ ఆచూకి దొరకలేదు దీంతో . మరు సటి రోజు చాంద్రాయణగుట్ట పోలీసులకు ఫిర్యాదు చేశారు. కేసు నమోదు చేసుకొని పోలీసులు రంగప్రవేశం చేశారు.

కేసు దర్యాప్తు చేపట్టిన పోలీసులు బార్కాస్, చాంద్రాయణ గుట్ట పరిసర ప్రాంతాల్లోని సీసీ కెమెరాలను పరిశీలించారు. బడీ మసీదు ప్రాంతంలో ఉన్న సీసీ కెమెరాల ఫీడ్ సాంకేతిక సమస్యతో ఓపెన్ కాలేదు. మరుసటి రోజు ఆ ఫీడ్ ఓపెన్ కావడంతో పరిశీ లించారు. 28న మధ్యాహ్నం 1.28 గంటలకు ఖాన్‌ను ఓ యువ కుడు తీసుకెళుతున్నట్లు గుర్తించారు. బాలుడి తండ్రి ఆ యువ కుడు తన ఇంటి పక్కనే ఉండే మైనర్ గుర్తించారు. ఎనిమిదో తరగతి వరకే చదివిన అతడు ప్రస్తుతం పాన్‌షాప్‌లో పనిచే స్తున్నాడు. పోలీసులు అతడిని అదువులోకి తీసుకుని సీసీ కెమెరా ఫుటేజ్ చూపించడంతో నేరం అంగీకరించాడు. పోలీసులు ఘటనాస్థలికి చేరుకుని ఖాన్ మృత దేహాన్ని పోస్టుమార్టం అనంతరం తల్లిదండ్రులకు అప్పగించారు. ఇక ఈ దారుణానికి ఒడిగట్టిన నిందితుడు ఇప్పటి వరకు 15 మందిపై ఇదే తరహాలో లైంగిక దాడికి పాల్పడినట్లు పోలీసుల విచారణలో వెల్లడించాడు. వారందరి నుంచి వాంగ్మూలాలు తీసుకుని మరికొన్ని కేసులు నమోదు చేయడానికి పోలీసులు సన్నాహాలు చేస్తున్నారు. 20 ఏళ్ల లోవు పిల్లలకు స్మార్ట్ ఫోన్లు ఇస్తుండటంతో ఇంటర్నెట్‌లో అశ్లీల వీడియోలు చూసేందుకు బానిసలవుతు న్నారు. దీంతో మైనర్లు కూడా విచక్షణ కోల్పోయి ఘాతుకాలకు పాల్పడుతు న్నారు. తల్లిదండ్రులు పర్యవేక్షణ లేకపోవడం వల్లే ఇలాంటి దారుణాలు చోటు చేసుకుంటున్నాయి. ఈ దుర్ఘటన తోనైనా తల్లిదండ్రులు మేల్కోవాల్సిన అవసరం ఉంది.

## జాతకం

# పూజగదిలో శివలింగం ఉంటే

నవగ్రహాల్లో బుధుడికి ప్రీతికరమైన మరక తాన్ని ధరించడం ద్వారా శుభఫలితాలు వుం టాయి. అలాగే మరకతంతో తయారైన శివ లింగాన్ని పూజించడం ద్వారా అనుకున్న కార్యాలు దిగ్విజయంగా పూర్తవుతాయి. కోరిన వరాలు నెరవేరుతాయి. నవరత్నాల్లో ఒకటైన మరకతానికి ఆకర్షణ శక్తి ఎక్కువ. అలాంటి మరకతాన్ని లింగ రూపంలో పూజించడం ద్వారా అన్నీ రంగాల్లో రాణిస్తారు.

విద్య, ఆరోగ్యం, ఉన్నత పదవులు లభించా లంటే.. మరకత లింగాన్ని పూజించడం ద్వారా ప్రాప్తిస్తాయి. అలాగే వ్యాపారంలో అభివృద్ధి సాధించాలంటే.. మరకత లింగాన్ని పూజిం చాలి. అంతేగాకుండా మరకత లింగాన్ని పూజిస్తే సమస్త దోషాలు తొలగిపోతాయని ఆధ్యాత్మిక పండితులు సూచిస్తున్నారు. ఈ లింగాన్ని నిష్ఠతో ప్రార్థించే వారికి ఒత్తిడి మాయమవుతుంది. అలాగే ఇంటనున్న ప్రతికూల శక్తులను తొలగిపోతుంది. అలాగే అనుకూలత చేకూరుతుంది.

ఈ మరకత లింగమో లేకుంటే వేరేదైనా శివలింగం ఇంట్లో వుండినట్లైతే... నియమం ప్రకారం పూజించాలి. శివలింగానికి ముందుగా నీరు, పాలు, తేనే, పెరుగు, పంచామృతాలతో అభిషేకించాలి. ఆపై బిల్వ పత్రాలు, చందనం,



విభూతితో అభిషేకించి.. దీపారాధన చేయాలి. పూజ గదిలో శివలింగం వుంటే స్నానం చేశాకే ఎవరైనా పూజగదిలోకి ప్రవేశించాలి.

మహా మృత్యుంజయ మంత్రాన్ని జపించాలి. పండ్లు, పువ్వులతో రోజూ అర్చించాలి. శక్తి మేరకు ధూపదీప నైవే ద్యాలు సమర్పించాలి. ప్రదోషకాలంలో తప్పక శివలింగానికి అభిషేకం చేయాలి. ఇలా శివలిం గాన్ని ఇంట వుంచి పూజ చేయడం ద్వారా శని గ్రహ దోషాలు తొలగిపో తాయి. ఆరోగ్య సమ స్యలు వుండవు. వ్యా ఎత్తిపరమైన అభివృద్ధి వుంటుంది. ఇంట పం డగ వాతావరణం నెల కొంటుంది. శుభ కార్యాలు జరుగుతాయి. మోక్షం సిద్ధిస్తుంది.

మీ సందేహాలని క్లుప్తంగా (మనిషికి 1 ప్రశ్న మాత్రమే) ఈ క్రింది వివరాలు వ్రాసి పంపండి. (పుట్టిన తేదీ వివరాలు లేనివారు 108 లోగా ఒక సంఖ్య వ్రాసి పంపండి. ఇది ప్రశ్న పద్ధతి, మనిషికి ఒక్క ప్రశ్న మాత్రమే)

పేరు : ..............................

పుట్టిన తేదీ : ..............................

పుట్టిన సమయం : ..............................

పుట్టిన ఊరు (మండలం) : ..................

ప్రశ్న : ..............................

పై వివరాలతో కూడిన లెటర్‌ను ఈ క్రింది అడ్రస్‌కు పంపండి...

'జాతకం' 'సూర్య' ఆదివారం

SPR publications, Surya Soudha, Plot.No: 185, M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar, AyyappaSociety Opp: Hi-Tech City, Hyderabad - 500 072.

## 16-7-2017 నుండి 22-7-2017 రాశిఫలం



మేషం: Aries( అశ్విని, భరణి, కృత్తిక - 1) : ఉద్యోగస్తులకు ప్రయాణాలలో ఎక్కువ చికాకులు ఇబ్బందులను ఎదుర్కొంటారు. ఇచ్చిపుచ్చుకునే వ్యవహారాలు, ఒప్పందాల్లో మెలకువ వహించండి. సతీసమేతంగా ఒక పుణ్యక్షేత్రాన్ని సందర్శిస్తారు. చిన్నారుల విషయంలో పెద్దలుగా మీ బాధ్యతలను నిర్వర్తిస్తారు. పెరిగిన ధరలు, చాలీచాలని ఆదాయంతో సతమతమవుతారు.



వృషభం: Taurus (కృత్తిక - 2,3,4, రోహిణి, మృగశిర - 1,2): సామాజిక కార్యక్రమాల పట్ల ఆసక్తి పెరుగుతుంది. మీ అభిప్రాయలను ఇతరులపై బలవంతంగా రుద్దడం మంచిది కాదని గమనించండి. విద్యార్థుల మొండి వైఖరి ఉపాధ్యాయులకు చికాకు కలిగిస్తుంది. కానివేళలో ఇతరుల రాక ఇబ్బంది కలిగిస్తుంది. ఖర్చులు అదుపు కాకపోగా మరింత ధనవ్యయం అవుతుంది.



మిధునం: Gemini (మృగశిర -3,4బ్యాంకు వ్యవహారాలలో పరిచయం లేని వ్యక్తులతో మితంగా సంభాషించండి. సాహస ప్రయత్నాలు విరమించండి. పెద్దల సలహాను పాటించి మీ గౌరవాన్ని నిలబెట్టుకుంటారు. ఉద్యోగస్తులకు పై అధికారుల నుంచి ఒత్తిడి, చికాకులు అధికమవుతాయి. వాహన చోదకులకు చికాకులు అధికమవుతాయి.



కర్కాటకం: Cancer(పునర్వసు -4, శ్రీవారు, శ్రీమతి విషయంలో మనస్పర్థలు ఏర్పడే అవకాశం ఉంది. నిరుద్యోగులకు ఇంటర్వ్యూలలో విజయం లభిస్తుంది. ఉద్యోగ వ్యాపారాలలో ఆటుపోట్లు ఎదుర్కొంటారు. ఆకస్మికంగా దూర ప్రయాణాలు చేస్తారు. రుణాల కోసం అన్వేషిస్తారు. విద్యార్థులు రాత, మౌఖిక పరీక్షల్లో విజయం సాధిస్తారు.



సింహం: Leo (మఖ, పుబ్బ, ఉత్తర -1) ఆర్థిక లావాదేవీల్లో ఒడిదుడుకులు ఎదురైనా అధిగమిస్తారు. స్త్రీలకు ఉపాధి పథకాల పట్ల ఆసక్తి పెరుగుతుంది. ఉద్యోగస్తులు ఒత్తిళ్ళు, ప్రలోభాలకు పోకుండా ఏకాగ్రతతో పనిచేయవలసి ఉంటుంది. మిమ్మల్ని పొగిడేవారే కానీ సహకరించే వారుండరు. కోర్టు పనులు కొంత మందకొడిగా సాగుతాయి.



కన్య: Virgo ( ఉత్తర - 2,3,4, హస్త, చిత్త -1,2) తలపెట్టిన పనులలో విఘ్నాలు, చీటికి మాటికి అసహనం ఎదుర్కుంటారు. గృహం ఏర్పరుచు కోవాలనే కోరిక బలపడుతుంది. మిత్రులు కూడా మీకు దూరంగా ఉండటానికి యత్నిస్తారు. ప్రైవేటు సంస్థల్లో వారికి యాజమాన్యం నుంచి ఒత్తిడి, చికాకులను ఎదుర్కొంటారు. నిరుద్యోగులకు ఇంటర్వ్యూల్లో ఏకాగ్రత అవసరం.



తుల: Libra (చిత్త -3,4, స్వాతి, విశాఖ -1,2,3) ఓర్పు, నేర్పుతో వ్యవహరించటం ఎంతైనా అవసరం. రుణ విముక్తులు కావటంతో మానసిక ప్రశాంతత పొందుతారు. పత్రికా రంగంలోని వారికి గుర్తింపు రాణింపు లభిస్తుంది. కోర్టు వ్యవహారాలు వాయిదా పడుట మంచిది. మీ సంతానం భవిష్యత్తు గురించి కొత్త పథకాలు వేస్తారు. పెద్దల ఆరోగ్యం నిరుత్సాహపరుస్తుంది.



వృశ్చికం: Scorpio (విశాఖ -4 అనూరాధ, జ్యేష్ఠ) ఇతరులపై ఆధారపడక స్వశక్తితోనే మీ పనులు పూర్తి చేసుకోవటం శ్రేయస్కరం. ఆత్మీయులతో కలిసి విహార యాత్రలలో పాల్గొంటారు. ఒక కార్యం నిమిత్తం దూర్రపయాణం చేయవలసి వస్తుంది. సన్నిహితులతో కలిసి చేపట్టిన పనులు సమీక్షిస్తారు. దూర్రపయాణాలు బ్యాంకింగ్ వ్యవహారాలలో అప్రమత్తత ఎంతో అవసరం.



ధనుస్సు: Sagittarius (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ -1) స్థిరాస్తి క్రయ విక్రయాలు సంతృప్తికరంగా ఉంటాయి. వృత్తుల వారికి శ్రమకు తగిన ప్రతిఫలం లభిస్తుంది. స్త్రీలకు పనివారితో చికాకులు అధికమవుతాయి. అతిథి మర్యాధలు బాగుగా నిర్వహిస్తారు. కోర్టు వ్యవహారాల్లో ప్లీడర్లు, ప్లీడరు గుమస్తాలకు ఆటంకాలు తప్పవు. స్త్రీలకు టి.వి ఛానెళ్ల నుంచి ఆహ్వానం అందుతుంది.



మకరం: Capricorn (ఉత్తరాషాఢ -2,3,4, శ్రవణం, ధనిష్ఠ -1,2): ఆర్థిక వ్యవహారాల పట్ల శ్రద్ధ వహిస్తారు. ఒక్కసారి ప్రేమిస్తే ఆ ప్రేమను నిలబెట్టుకోవడానికి ఎంతైనా పోరాడతారు. మిమ్మల్ని అభిమానించే వ్యక్తుల మనస్సులను బాధపెట్టకండి. ఉద్యోగస్తులు ఒత్తిళ్ళు, ఆకర్షణలకు దూరంగా వుండటం అన్నివిధాలా క్షేమదాయకం. ఎల్.ఐ.సి, పోస్టల్ ఏజెంట్లకు ఒత్తిడి, ఆందోళన తప్పవు.



కుంభం: Aquarius (ధనిష్ఠ-3,4, శతభిష, పూర్వాభాద్ర- 1,2,3 ఇతరులకు పెద్దమొత్తంలో ధనసహాయం చేసే విషయంలో లౌక్యంగా వ్యవహరించండి. మీ ధైర్యసాహసాలకు మంచి గుర్తింపు లభిస్తుంది. విదేశీయానాలకై చేయు యత్నాలు అనుకూలిస్తాయి. స్త్రీల ఆరోగ్యంలో మార్పు ఆందోళన కలిగిస్తుంది. సజ్జన సాంగత్యం, ప్రముఖులతో పరిచయాలు మీ ఉన్నతిని పెంచుతాయి.



మీనం: Pisces (పూర్వాభాద్ర -4, ఉద్యోగస్తులు అపరిచిత వ్యక్తుల పట్ల అప్రమత్తంగా మెలగవలసి ఉంటుంది. రేషన్ డీలర్లకు కొత్త సమస్యలు తలెత్తుతాయి. బ్యాంకు పనులు మందగిస్తాయి. వృత్తి వ్యాపార సంబంధాలు విస్తరిస్తాయి. దూర ప్రయాణాలలో ఇబ్బందులను ఎదుర్కొంటారు. మీ సంతానం మొండివైఖరి మీకు ఎంతో ఆందోళన కలిగిస్తుంది.



నిద్రపోయి కలగన్నాను బ్రతుకంతా సుందరమని. మేలుకొని కనుగొన్నాను బ్రతుకు పెద్ద బాధ్యత అని. -గొథె

## ఆలయం

# వేయి వసంతాల బృహదీశ్వర ఆలయం



విశాలమైన ఈ ఆలయానికి చేరడానికి మూడు ద్వారాలున్నాయి. మొదటి ద్వారం కేరళాంతకన్, రెండవ ద్వారం రాజరాజన్ తిరువనల్, మూడో ద్వా రం తిరువానుక్కన్ తిరువనల్. అక్కడో నంది మండపం వుంది, ఇది మన రాష్ట్రంలోని లేపాక్షి బసవన్న తరువాత అంత భారీ విగ్రహం. ఈ నంది మండ పాన్ని చోళ రాజుల తర్వాత పరిపాలించిన నాయక రాజులు, మరాఠాలు అంద మైన నగిషీలతో చింత్రించిన చిత్రాలను అద్భుత రీతిలో మలిచారు. ఈ మహా నందికి ఎదురుగా ప్రధాన ఆలయం ఉంది. ఈ ఆలయం పై భాగం మహా ముఖ మండపాలతో నాలుగు అంతస్తులతో ఉంది. ఆలయ ప్రధాన ద్వారం తూర్పుకు ఉండగా పడమర, ఉత్తర, దక్షిణ దిశల్లో కూడా ద్వారాలున్నాయి. గర్భ గుడిలో చలా పెద్ద లింగ పీఠమూ, దాని మీద అతిపెద్ద లింగమూ ఉన్నాయి. ఇంత అందమైన, పెద్దదిగా ఉన్న లింగము దేశంలో ఇక్కడే చూస్తాము. రెండు గోడల మధ్య రెండు అంతస్తులలో ప్రదక్షిణ మార్గం ఉంది. నాలుగువైపుల ద్వారాలున్న ఈ ఆలయం చతుర్ముఖం లేక సర్వతోభద్రంగా ఉన్న ఆల యంగా వర్ణిస్తారు శిల్పులు.

ఆలయ బయటి ద్వారాల ప్రక్కల ఎత్తన ద్వారపాలకుల విగ్రహా లున్నాయి. బయటి గోడల నిలువు గూళ్ళపైనా, రెండవ స్తం భాల గోడలపైనా పెద్ద శాల ఉంది. మధ్య ఉన్న నిలువి గూళ్ళ పైన పంజరాలున్నాయి. ద్వారానికి అటు, ఇటు వైపున ఉన్న నిలువు గూళ్ళను దేవకోస్టాలుగా తీర్చి దిద్ది వాటితో అందంగా చెక్కిన దేవతామూర్తుల విగ్రహాలు ప్రతిష్టించారు. ఈ దేవతా మూర్తుల అవతార గాధలను శిల్పాలుగా సూక్ష్మ రూపంలో చెక్కి అక్కడ ఉంచడం ఈ దేవాలయం ప్రత్యేకత. క్రింద గర్భాలయం గోడలో దక్షిణాన కూర్చున్న శివుడు, పడమతివైపున నటరాజు, ఉత్తరాన దేవీమూ ర్తులు ఉన్నారు. అంతేకాక ప్రదక్షిణ మార్గం లోపలి గోడ మీద, కుడ్య స్తంభాల మీద వర్ణచిత్రాలను అద్భుతంగా చిత్రించారు. ఈ వర్ణ చిత్రాలలో శివుడు త్రిపురాసురుడిని సంహరించిన కథ, నటరాజును పూజిస్తున్న రాజు, ఇంకా పక్షులు, అందమైన లతలు, నాట్య భంగిమలతో ఉన్న నాట్యకతెలు వంటి పలుచిత్రాలు మనల్ని అబ్బురపరుస్తాయి. ఈవిధంగా సర్వకళాశోభితమై, సంస్కృత, తమిళ శాసనాలున్న చారిత్రాత్మక ప్రసిద్ధ దేవాలయంగా అలరారుతోందీ బృహదీశ్వర ఆలయం.. ఈ ఆలయాన్ని మొదటి రాజరాజచోళుడు ప్రారంభించినా తరువాత వచ్చిన వివిధ పాలకులు, రాజులు అభివృద్ధిపరిచారు. ఈ ఆలయానికి ఏ దేవాలయా నికీ లేని ఒక ప్రత్యేకత ఉంది. కుల, మత, వర్గ భేదం లేకుండా అందరూ ఈ ఆలయాన్ని దర్శించవచ్చని ఇక్కడ ఒక ప్రకటన కూడా ఉంది. విదేశీయులు కూడా ఈ ఆలయాన్ని దర్శించవచ్చు.



ఆలయం నిర్మాణంలో అన్నీ వింతలే.

బృహదీశ్వరాలయం వేయి సంవత్సరాల నాటి గుడి. అంతే కాదు భారత నిలబడటమనేది ఇప్పటికీ అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తుతోంది. దేశంలోనే అతి పెద్ద శివలింగం ఉన్న గుడి. ఇక్కడ కనిపించే ప్రతి అంశం ఓ మిస్టరీతో పాటు ఆశ్చర్యానికి గురిచేస్తుంది. ఎక్కడా సిమెంట్ అన్నమాటకు తావు లేకుండా ఉక్కు అన్నపదం లేకుండా కట్టిన ఈ గుడిని చూస్తే ఆనాటి టెక్నాలజీ ఇంత అద్భుతంగా ఉందా అని పిస్తుంది. ఆశ్చర్యంతో పాటు ఆసక్తి రేవుతున్న ఆ గుడి గురించిన కొన్ని మిస్టరీ వింతలు. ఇది 13 అంతస్థులు కలిగిన ఏకైక పురాతన క్షేత్రం. భారతదేశంలో అతి పెద్ద శివలింగం ఉన్న క్షేత్రం. దాదావు ఈ శివలింగం 3.7 మీటర్ల ఎత్తు కలిగి ఉంటుంది. పెద్ద నంది విగ్రహాన్ని అక్కడ నిర్మించారు. ఈ విగ్రహం దాదావు 20 టన్నులు కలిగి ఉంటుంది. ఇంకా ఆశ్చర్యకరం ఏంటంటే ఇది ఏక శిలా విగ్రహం. 2 మీటర్ల ఎత్తు ,2.6 మీటర్ల పొడవు, 2.5 మీటర్ల వెడల్పు కలిగి ఉంటుంది. ఈ ఆలయానికి ఎటువంటి ఉక్కు గాని సిమెంట్ కాని వాడలేదు. పూర్తిగా గ్రానైట్ రాయితో కట్టబ డింది. 80 టన్నుల ఏకశిలతో చేసిన గోపుర కలశం ఈ గుడికే హైలెట్.

13 అంతస్థుల పైన ఎటువంటి వాలు లేకుండా ఇక మిట్ట మధ్యాహ్న సమయంలో ఆ గోపురం నీడ ఎక్కడా పడదు. గుడి నీడ కనపడినా గోపురం నీడ మాత్రం చూడలేము. ఈ ఆలయ ప్రాంగణం దాదావు పర్లాంగు దూరం ఉంటుంది. అంటే చాలా సువిశా లంగా ఉం టుంది. మనం మాట్లా డుకునే శబ్దాలు మళ్లీ ప్రతిధ్వనిం చవు. అంతటి శబ్ద పరిజ్ఞానంతో ఈ గుడిని కట్టారు. ఆలయం లోపల అనేక సొరంగ మార్గాలున్నాయి. ఇవి కొన్ని తంజా వూరులో ఉన్న కొన్ని ఆలయాలకు దారితీస్తే కొన్ని మాత్రం మరణానికి దారి తీసే గోతులు కలిగి ఉన్నాయని అన్ని దారులు మూసేశారు. అయితే ఇప్పటికీ టెక్నాలజీకి అంతుపట్టని విషయం ఏం టంటే. ఈ గుడికి చుట్టూ ఉన్న రాతి తోరణాలలో ఆరు మిల్లీమీటర్ల కన్నా తక్కువ సైజులో వంవుతో కూడిన రంధ్రలు కనిపించడం. అవి అలా ఎందుకు పెట్టారు ఇప్పటికీ మిస్టరీనే. వేయి సంవత్సరాల గుడులు దాదావు పాడుబడిన స్థితిలో ఉంటాయి.



## ధ్వజస్థంభం కథ




ఏ దేవాలయానికి వెళ్ళినా ముందుగా ధ్వజ స్థంభానికి మొక్కి, ప్రదక్షి ణచేసి ఆత ర్వాతే లోపలికి వెళ తాం. ఈ ధ్వజస్థం భం ఏర్పడటానికి ఓ కథ ఉంది. భారత యుద్ధానంతరం పాండవులలో జ్యేష్టుడైన ధర్మరాజు సింహాసనాన్ని అధిష్టిస్తాడు. ధర్మబద్ధంగా రాజ్య పాలన చేస్తుంటాడు. ధర్మమూర్తిగా,



గొప్పదాతగాపేరు పొందాలనే కోరికతో విరివిగా దానధర్మాలు చేయడం మొదలు పెడతాడు. ఇదంతా చూస్తున్న శ్రీకృష్ణుడు అతనికి తగినరీతిగా గుణపాఠం చెప్పాలనుకుంటాడు. ధర్మరాజుకి అశ్వమేధయాగం చేసి, శత్రురాజులను జయించి, దేవతలనూ బ్రాహ్మణులను సంతుష్టి పరచి, రాజ్యాన్ని సుస్థిరం, సుభిక్షం చేయమనీ చెప్తాడు. ధర్మరాజు శ్రీకృష్ణుని మాట శిరసా వహించి అశ్వమేధానికి సన్నాహాలు చేయించి, యాగాశ్వానికి రక్షకులుగా నకుల సహదేవులను సైన్యంతో పంవుతాడు.ఆ యాగాశ్వం అన్నిరాజ్యాలూ తిరిగి చివరికి మణివుర రాజ్యం చేరుతుంది. ఆ రాజ్యానికి రాజు మయూర ధ్వజుడు. ఆయన మహా పరాక్రమ వంతుడు, గొప్ప దాతగా పేరుగాంచినవాడు. మయూరధ్వజుని కుమారుడు తామ్ర ధ్వజుడు, పాండవుల యాగాశ్వాన్నిబంధిస్తాడు. తామ్రధ్వజునితో యుద్ధం చేసిన నకులసహదేవులు, భీమార్జునులు ఓడిపోతారు. తమ్ములందరూ ఓడిపోయిన విషయం తెల్సుకున్న ధర్మరాజు స్వయంగా యుద్ధానికై బయలుదేరగా శ్రీకృష్ణుడు అతన్ని వారించి మయూరధ్వజుడ్ని యుద్ధంలో జయించడం సాధ్యంకాదనీ, మహాబల పరాక్రమవంతులైన భీమార్జునులే ఓడిపోయారనీ,అతడ్ని కపటోపాయాంతో మాత్రమే జయిం చాలనీ చెప్తాడు. శ్రీకృష్ణుడు, ధర్మరా జుతో కలసి వృద్ధ బ్రాహ్మణుల రూపంలో మణివురం చేర్తాడు. ఆ బ్రాహ్మణులను చూసిన మయూరధ్వ జుడు వారికి దానం ఇవ్వదలచి ఏమి కావాలో కోరుకొమ్మని అడుగుతాడు. దానికి శ్రీకృష్ణుడు..రాజా! మీ దర్శనార్ధమై మేమువస్తున్న దారిలో ఒక సింహం అడ్డు వచ్చి ఇతని కుమా రుడ్ని పట్టుకుంది. బాలుని విడిచి పెట్టవలసినదిగా మేముప్రా ర్థించగా, సింహం మానవ భాషలో మీ కుమారుడు మీకు కావాలంటే మణివుర రాజైనా మయూరధ్వ జుని " శరీరంలోని సగభాగం నాకు ఆహారంగా, అతడి భార్యా వుత్రులే స్వయంగా కోసి ఇవ్వగా తెచ్చి ఇస్తే, ఇతడ్ని వదిలేస్తాననీ చెప్పిందనీ, కనుక ప్రభువులు మా యందు దయదలచి తమ శరీరంలోని సగభాగాన్ని దానమిచ్చి ఇతడి కుమారుని కాపాడమని కోరుతారు. వారి కోరిక విన్న మయూరధ్వజుడు అంగీకరించి దానికి తగిన ఏర్పాట్లు చేయించి భార్యాసుతులు అతని శరీరాన్నిమధ్యకు కోసి వారికి ఇవ్వమని చెప్తాడు. వారు ఆయన శరీరాన్ని సగంగా కోయటం చూచిన ధర్మరాజు అతని దాన గుణానికి నివ్వెరపోయాడు. ఇంతలో మయూరధ్వజుని ఎడమకన్ను నుంచి నీరు కారటం చూసిన ధర్మరాజు తమరు కన్నీరు కారుస్తూ ఇచ్చిన దానం మాకు వద్దు గాక వద్దు అంటాడు. అందుకు మయూరధ్వజుడు, మహాత్మా తమరు పొరపడుతున్నారు. బాధపడి నా శరీరాన్ని మీకివ్వటం లేదు. నా కుడి భాగం పరోపకారానికి ఉపయోగపడింది, కానీ ఆ భాగ్యం తనకు కలగటంలేదు కదా అని ఎడమ కన్ను చాలా బాధపడుతూ కన్నీరు కారుస్తున్నది. అని వివరిస్తాడు. మయూరధ్వజుని దానశీలతకు మెచ్చిన శ్రీకృష్ణుడు తన నిజరూపాన్ని చూపి మయూరధ్వజా! నీ దానగుణం అమోఘం ! ఏదైనావరం కోరుకో! అనుగ్రహిస్తాను అంటాడు. పరమాత్మా! నా శరీరం నశించినా నా ఆత్మ పరోపకారార్థం ఉపయోగపడేలా నిత్యం మీ ముందు ఉండేలాగానుగ్రహించండి అని కోరుతాడు మయూరధ్వజుడు. అందుకు శ్రీకృష్ణుడు తథాస్తు అని పలికి, మయూరధ్వజా! నేటి నుంచీ ప్రతి దేవాలయం ముందు నీ గుర్తుగా నీ పేరున ధ్వజస్తంభాలు వెలుస్తాయి. వాటిని ఆశ్రయించిన నీ ఆత్మ, నిత్యం దైవ సాన్నిధ్యంలో ఉంటుంది. ముందు నిన్ను దర్శించి ప్రదక్షిణ నమస్కారాలు ఆచరించిన మీదటనే ప్రజలు తమ ఇష్టదైవాలను దర్శించుకుంటారు. ప్రతినిత్యం నీ శరీరమున దీపం ఎవరుంచుతారో వారి జన్మ సఫలం అవుతుంది. నీ నెత్తిన ఉంచిన దీపం రాతలందు బాటసారులకు దారి చూపే దీపం అవుతుంది అంటూ అనుగ్రహించాడు. ఆనాటి నుంచీ ఆలయాల ముందు ధ్వజస్తంభాలు తప్పనిసరిగా ప్రతిష్ఠించడం ఆచారమయింది. భక్తులు ముందుగా ధ్వజస్థంభానికి మొక్కి ఆ తర్వాతే ములవిరాట్టు దర్శనం చేసుకోడం సాంప్రదాయంగా మారింది.





చట్టాలు ఎంత మంచివైనా వాటిని మన్నించేవారు అరుదు. అంతేకాక వాటిని అమలు చేయడం మరీ కష్టం. -ఫ్రాంక్లిన్

# www.mohanpublications.com

# మోహన్ పబ్లికేషన్స్‌లో లభించు పుస్తకముల పట్టిక

## (Book List)

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆయుర్వేద, మంత్రశాస్త్రాది
అనేక విషయాలు తెలుసుకోండి...

ఫేస్‌బుక్ **మోహన్ పబ్లికేషన్స్** పేజ్ లైక్ చేయండి.



Like us to follow :

**MOHAN PUBLICATIONS**

Rajamahendravaram



0883 - 246 2565
903 246 2565

mohan
PUBLICATIONS

# మోహన్ పబ్లికేషన్స్

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మి - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

